# నవశక్తి

Vol. 1, no. 8

(Feb. 2, 1938)

రాజమండ్రి, 1938

Record no. 682

NAVASAKTI అణా Telugu Weekly




## కార్మిక కర్షకులారా! ఏకము గండు!!

సాలు చందా ౩–౦–౦ ప్రచురణ: ప్రతిబుధవారం సంపాదకుడు: మద్దూరి అన్నపూర్ణయ్య

సంపుటం ౧. { రాజమండ్రి 2—2—38 } సంచిక ౮.



### పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ



"కోట్ల కొలది ప్రజలకు వందల కొలది ఉపన్యాసాల ద్వారా, దేశభక్తిని ప్రబోధించాడు. ఆలాభమంతా పదవిలో నున్న కాంగ్రెసు మితవాదులకు ఉపయోగించింది" అని వ్రాస్తున్నాడు ఒక విమర్శకుడు 'బొంబాయి క్రానికల్'లో.






# వ్యవసాయపు కూలీలకు హెచ్చరిక.

ఎండలో ఎండుతూ, వానలో తడుస్తూ, చలిలో వణుకుతూ, పగలు రాత్రి, మీరు మీ భార్యా బిడ్డలు పొలములోబడి బండచాకిరీ చేస్తూన్నా కడుపుకు కూడు, కట్టగుడ్డ, నిలువనీడ లేకుండా యున్నారు. మీరు ఎముకలరిగేటట్లు పనిచేస్తుంటే మీ కడుపులో మడతకుడుములు. కష్టమంటే యేమిటో తెలియకుండా, కండపైకండ పెంచుకొని కబుర్లుచెప్పే ధనికవర్గమునకు షడ్రసములతో భోజనము. మీరు కాపురముండుటకు తాటాకు గుడిసెలైన లేకుండాయుంటే వారికి ఒక్కొక్క నగరములో ఒక్కొక్క రకము దివ్యభవనము. మీస్త్రీలు మానం కాపాడుకొనుటకు చింకిరి గుడ్డయినా లేకుండాయుంటే వారి వనితలు, మడియ మడియకు పట్టుచల్లాలను మారుస్తూ యుంటారు. మీబిడ్డలు అక్షరాభ్యాసమే లేకుండా జానిసలుగా తయారవుతుంటే వారిబిడ్డలు కళాశాలలలో డిగ్రీలు పొంది మీపై స్వారిచేయుటకు తయారగు చున్నారు.

...షికపైతు—పన్ను తీర్వాయిలు పెట్టుకొని పెద్దపొ జ్ఞుకోల్ని క్రిసెట్టి పరీవాన్యం బజారు సీలుకుంచముతో అరిందా కొలగానిచే కొలిపించి ఎ 1 కి 12 బస్తాలు ప్రథమ పంటకు. రెండవపంటలో పాలు. వాయిదాకు పూర్వమే తన స్వంతఖర్చులలో యీనాందారు యింటికి పట్టుకువెళ్ళి పురికట్టించి, అణావిళ్ళ కాగితము తానేపట్టుకువెళ్ళి రశీదు తెచ్చుకుంటాడు. కాని కూలీ దగ్గరకు వచ్చేటప్పటికి రేపురా, మాపురా యని తిప్పుతాడు. దాళవాధాన్యం, గరికిసన్నాలు ధాన్యం, కుప్ప అడుగు బెడ్డలున్నవన్నీ, అర్ధకాయలుకొరకు వెదికి సంపాదిస్తాడు. తాతలనాటి పిచ్చుకుంచం తెస్తాడు. తన యిష్టమువచ్చినట్లు తప్పుడు లెక్కలు చెప్పుతాడు. పంటపోయినా శిస్తు రిమిషన్‌కు ప్రయత్నించడు గాని, పాలేరు తెగులువచ్చి మానివేసిన నాగాలకు మాత్రము సాగదీసి నష్టము కడతాడు. చేలోపండిన మంచి మంచి కాయలు, పండ్లు యీనాందార్ల యిండ్లకు పట్టుకువెళ్ళి యిస్తాడుగాని, కూలివాడు కళ్ళనకాయైనా పట్టుకువెళ్లుటకు ఒప్పుకోడు. ఉద్యోగస్తులకు మామూళ్ళక్రింద ఎన్ని గడ్డిమోపులైన యిస్తాడుగాని పాలేరు ప్రక్కకైన పట్టుగుప్పెడు పరకలు యివ్వడు. ఈవిధముగ తనతో నిత్యము తనకంటె అధికముగ కష్టపడేకూలీని బాధిస్తాడు. అందరికితాను లోకువైతే తనకు కూలీలోకువ. దీనికంతకు కారణము. సరాయి ప్రభుత్వము. దాని అండచేయున్న జమీందార్లు షాహుకార్లు, ఉద్యోగస్తులు, యీనాందార్లు కర్రిపెత్తనం రైతులు మొదలగువారు ఆడుచున్న కపటనాటకము. అదే సామ్రాజ్యవాదము. అదే ధనికవాదము. "కర్మము" అనే మత్తుమందు చల్లి మిమ్ములను పీల్చిపిప్పిచేసి వారి సేవచేయుటకు మాత్రము జీవచ్ఛవముల్లాగ బ్రతుకనిస్తున్నారు. కులభేదములుపెట్టి. కూలీలకు రైతులకు కలహములుపెట్టి. పైనుండి తామేవిధమైన కష్టముపడకుండ సర్వవిధముల దోచుకుంటున్నారు.

ఇట్లు ఎంతకాలము బాధపడెదరు? ఈవిధముగ మీపొట్టలు మాడుచున్నను, వారి కొట్టులు, పెట్టెలు నింపవలసినదేనా? వ్యవసాయ కూలీసోదర సోదరీమణులారా! మేల్కొండి. మీరుకూడా మనుష్యులనే సంగతి జ్ఞప్తియందుంచుకోండి. సర్వవిధ భోగభాగ్యలకు మీరే కారకులని గ్రహించండి. వాటి ననుభవించుటకు మీరుకూడా అర్హులని తెలుసుకోండి. జాతి, మత, కులభేదములు పాటించకండి. కష్టపడి భూమి దున్ని వ్యవసాయము చేసేరైతులకు, మీకుభేదము లేదని గుర్తించి శ్రమజీవులందరు ఏకముకండి. మీ హక్కుల కొరకు పోరాడండి. మీ సంఘశక్తిని ప్రదర్శించండి. కూలీరాజ్య స్థాపనకై ప్రయత్నించండి.

కార్మికులారా! మీలో 18 సం॥లు దాటిన స్త్రీపురుషులెల్లరు ఒకకాని సభ్యత్వరుసుము చెల్లించి, వ్యవసాయకూలీ సంఘములో సభ్యులుకండి. ప్రతిపల్లెలోను ప్రాథమిక సంఘమును స్థాపించండి. మీకోర్కెలు. మీఅవసరాలు మీసంఘములద్వారా, సభలద్వారా వెల్లడించండి. ఆందోళన చెయ్యండి. సభ్యత్వదరఖాస్తు పుస్తకములు వలయువారు "జిల్లాసంఘ కార్యాలయము—రాజమండ్రి"కి వ్రాయండి.

కొండపాటి శ్రీపట్టాభిరామయ్య,
ప్రధాన కార్యదర్శి.
తూ. గో. జిల్లా వ్యవసాయపు కూలీసంఘము.



# యువజనులకు హెచ్చరిక

ఆంధ్రరాష్ట్ర యువజనసంఘ కార్యనిర్వాహక వర్గంవారు గుంటూరు జిల్లాలో, జిల్లాకార్యనిర్వాహకవర్గం లేకపోవుటచే నన్ను జిల్లా యువజన సంఘ ఆర్గనైజరుగా నియమించారు. జిల్లాలోని ప్రాథమిక యువజనుల సంఘముల పని కేంద్రీకరించి, శాస్త్రబద్ధమైనంత త్వరలో జిల్లాలో యువజనసంఘ మహాసభ ఏర్పాటుచేయించు బాధ్యతను నేను నిర్వర్తించ వలసియున్నది.

ఇప్పుడు నేను జిల్లాయువజన సంఘ తరఫున సభ్యత్వఫారములు, రాష్ట్రీయయువజన సంఘప్రణాళికలు అచ్చువేయించినాను. కనుక, వెంటనే ప్రాథమిక యువజన సంఘముల కార్యదర్శులునాకు, ఈదిగువ విషయములు గమనించి జవాబులు వ్రాయవలెను.

(1) సభ్యత్వ ఫారములు, ప్రణాళికలు అవసరమైనన్ని తెప్పించుకొనవచ్చును.

(2) ప్రతి సభ్యుని చేత, సభ్యత్వ ఫారముమీద సంతకం చేయించి, కాపీ జిల్లా ఆఫీసుకు పంపాలి. ప్రతి ప్రాథమిక జిల్లా యువజన సంఘం ఒక్కొక్క సభ్యునికి, రాష్ట్రీయుల రుసుముక్రింద సంవత్సరానికి 0-2-0 చొ॥ పంపాలి. ప్రణాళిక 1కి 0-0-3 చొ॥ పంపాలి

(3) ఆయా ప్రాథమిక సంఘము ఏర్పడి ఎంతకాలమయినది, సభ్యులసంఖ్య, అక్కడి అధ్యక్ష కార్యదర్శుల పూర్తి అడ్రసులు, అక్కడి సంఘము లాచరిస్తున్న కార్యక్రమం వివరములు వెంటనే జిల్లా అఫీసుకు పంపాలి.

ప్రాథమిక యువజన సంఘములు దీనినే సర్క్యులర్‌గా పరిగణించి, నాకీ క్రింది అడ్రసుకు జవాబులు వ్రాయవలయునని నా హెచ్చరిక.

అమువాది కృష్ణమూర్తి,
సిటీ యువజన సంఘం ఆఫీసు,
గుంటూరు.

# ఎట్టి భేదభావములేకయే 

# రాజకీయ ఖైదీల విడుదలచేయాలి

## రాజ్యాంగము స్వీకరించిన ప్రతివారి ప్రథమ కర్తవ్యము: ఖైదీల విముక్తి చేయుటయే!

నేడు మన కాంగ్రెసు యావద్భారత దేశమునకు స్వాతంత్ర్యము సంపాదింప కంకణము కట్టుకొని యున్నది. కాని వెనుక నొకానొక సమయమున నీ కాంగ్రెసు నాయకులే సంపూర్ణ స్వాతంత్ర్యమును తమ లక్ష్యముగ పెట్టుకొన వెరచుచుండిరి. ఆ సమయమున గూడ ఎట్టి ఆపదలకును వెనుదీయక కాంగ్రెసు మహారథికుల సహాయము లేకనే కేవలము తమ స్వాభిప్రాయములపై నాధారపడి సంపూర్ణ స్వాతంత్ర్యమునకై యాందోళన సాగించిన యువకు లనేకు లుండిరి. దేశమునందు వారికి గల యీ యేకోన్ముఖ మగు ప్రీతి వలన, వా రొనర్చిన త్యాగములు ప్రశంసనీయములు. ఇల్లు వాకిలి వదలి తలిదండ్రుల స్నేహమునకు దూరమైపోయి బంధుగణముచే అతి హీనముగ జూడబడు చుండిరి. కాని తమ దేశభక్తియం దెంతమాత్రమును కొరత రానీయక, దానిని కాపాడుటకై నిప్పులో దుముకుటకును సముద్రమున బడుటకును గూడ సంసిద్ధు లైయుండిరి. భారతదేశమునకు స్వరాజ్యమును సంపాదించుటకు వీరవలంబించిన మార్గము తీవ్ర మైనదియు కంటకావృత్తము నగుటచే యనేకుల కదియచింపక పోవచ్చును. స్వాతంత్ర్య ప్రాప్తి కొరకే యీ సోదరు లందరు తమ సర్వస్వములను అర్పించి రను విషయము నే దెవ్వడును త్రోసివేయజాలడు. వీరి త్యాగబుద్ధి, కష్ట సహనము, అణచరాని యుత్సాహము, చలింపని దీక్షతో కూడిన దేశ ప్రేమయు అద్భుతములు. ఎన్నికల ఘోషణాపత్రము (Election Manifesto) లో కాంగ్రెసు వారు రాజకీయ ఖైదీలను విడిచిపెట్టెదమని ప్రజలకు వాగ్దానము లొసగుట కిదియే కారణము. కాని నేడు, కాంగ్రెసు అధికారములోనికి వచ్చి అయిదారు మాసము లైనను, వారి అధికారములో గల రాష్ట్రములలో సైతము యింకను జైళ్ళలో రాచకీయ ఖైదీలు ప్రగ్గు చుండుట శోచనీయము. కాంగ్రెసువారి రాష్ట్రముల లోన ఖైదీ లింకను జైళ్లలో నుండ అన్య ప్రాంతములలోనివారు ఖైదీలను వదలుదురని మన మెట్లు విశ్వసించగలము.

ఒకవంక మనకు రాష్ట్రీయ స్వాతంత్ర్యము వచ్చినదని చెప్పబడుచున్నది-చరిత్రనుబట్టి చూడ నవీనముగ రాజ్యాధికారము పొందిన వా రెల్లరు నొనర్చు మొదటి పని రాచకీయ ఖైదీల విడుదల యనియే స్పష్ట మగుచున్నది.

సర్వశక్తులు మన చేతిలోనికి వచ్చినవా లేదా యను విషయమును తేల్చుటకు ప్రప్రథమమైన పరీక్ష రాచకీయ ఖైదీల విడుదలయే. 1929 లో గాంధిగారే స్వయముగ రాచకీయ ఖైదీల విడుదలయే హృదయ పరివర్తనమునకు మంచి పరీక్ష యని చెప్పి యుండిరి. రాష్ట్రీయ స్వాతంత్ర్యము గల్గిన నేటిరోజున రాచకీయ ఖైదీలు విడుదల పొందిరా లేదా యను విషయమే మనసులో పీకుచుండును. ఈ రాచకీయ ఖైదీ లెవరు? దేశమును దాసిత్వమునుండి రక్షించుటకు సంపూర్ణ స్వాతంత్ర్యమునే ధ్యేయముగా నెంచుకొని అందర కన్న ముందు తమ ప్రాణములకు సైతము వెనుదీయక దేశముకొరకు పోరాటము సల్పిన దేశభక్తులు. స్వతంత్రము లభించినదని చెప్పుకొను నీ దినములలో గూడ నా దేశభక్తు లింకను జైళ్లలో ప్రగ్గుచుండుట సంభవించుచున్నది. 1920 సంవత్సరము రాష్ట్రీ స్వరాజ్యము లేకపోయినను వేలకొలది రాచకీయ ఖైదీలు చక్రవర్తిగారి యాదేశమున విడుదల పొంది యుండిరి. "హింసఅహింస" యను విషయమునకు చోటు ఇవ్వక దేశమునందలి అన్ని రాష్ట్రములలోను ఆ సమయమున విడుదల చేసిరి. 1920 సం॥ నాటి కన్న నేడుఎక్కువ అధికారము మనకు వచ్చిన దనుచున్నారు. కాంగ్రెస్‌వారి చేతులలోనికి పరిపాలనా సూత్రములుప్రవేశించినవట-యింత వైనను ఖైదీల గతి యీవిధముగ నున్నది!

ఒకవైపు బర్మాలో 700 లకు పైగా రాచకీయ ఖైదేలు విడుదల పొందినట్లు తెలియవచ్చినది. వీరందరు బహిరంగముగ బ్రిటిషువారి పటాలములతో యుద్ధము చేసి పట్టుబడినవారు. బెంగాలురాష్ట్రము

వారణాశి రామమూర్తి

నకు గవర్నరుగా నుండిన సర్ జాన్ అండర్సన్ ఐర్లండులో ఉండినపుడు తాను అచటి రాచకీయ నిర్బంధితుల నందరను వదలిపెట్టునట్లు వ్రాసి యున్నాడు. అచట ఆ విధముగ జరిగినపుడు భారత దేశమున నింకను, జైళ్లలో రాజకీయ ఖైదీ లుంచబడుటకు నీ దేశమొనర్చిన యపరాధ మేమి? వా రింకను ఆ దశయం దుంచబడుటకు కారణము వా రుద్దేశించిన కుట్రలు విఫలములై పోయిన వనియేనా? ఇచట కేవలము కుట్రలు పన్నబడి యుండినవి. అం దొకటియు ఫలించి యుండలేదు. కాని బర్మా, ఐర్లండులలో ప్రత్యక్షముగ యుద్ధములు గూడ జరిగియుండెను. అచ్చటి ఖయిదీ లందరు విడుదల పొందియుండ కుట్ర సల్ప కేవలము ఉద్దేశించి నట్టివారు గూడ విద్రోహులుగ పరిగణింపబడి నే డింకను జైళ్ళలో నుంచబడి యున్నారు.

మన దేశమున అందరు కలిసి యే అరువది డెబ్బది మందియో రాజకీయ ఖయిదీ లున్నారు. కాని బర్మా ఐర్లండులలో నిట్టివారి సంఖ్య వందలలో యున్నది. ఆ దేశములలో వారందరు విముక్తులగుటకు మనదేశములో- రాష్ట్రీయ స్వాతంత్ర్య మేర్పడి కాంగ్రెసు అధికారములో నున్న నీ దినములలో గూడ-నీ రాజకీయ బందితు లింకను విడుదల గాకుండటకు కారణమేమి? మన రాష్ట్రీయ స్వాతంత్ర్య మిదియేనా?

కాకోరి కేసులోని నిర్బంధితులు విడుదల పొందినప్పుడు వారికి ప్రజలు పూర్ణమగు స్వాగత మిచ్చుటచే దేశమం దంతటను మరల విప్లవ జ్వాలలు నెలకొనుచున్నవని తలంచుచున్నారు. వారికి అహ్వాన మొసగునపుడు ప్రజ లొనర్చిన జయధ్వానములు హింసాత్మకములుగ నున్నవట. యీ కారణములచే ప్రాంతీయ గవర్నరులు కుపితులగుట చూచి కాంగ్రెసుమంత్రులు వేరు గత్యంతరము లేక, రాజకీయ బందీలను విడువ కుండుటకే నిశ్చయించిరట— కాంగ్రెసింతవరకు విప్లవము రావలెనని కోరుచుండినది. "విప్లవము వర్థిల్లుగాక" (యిన్కిలాబ్ జిందాబాద్) అను కేకలు వైచి కాంగ్రెసువారు తాము విప్లవ తరంగములు లేవదీయుచున్నామని యనుకొనుచుండిరి. కాని నే డీ ఖయిదీల కొసగిన స్వాగత సందర్భమున నా ధ్వానములే ప్రజలు నలుప నధికారము వహించిన కాంగ్రెసు నాయకులకు ఆందోళన కలిగినది. కాన్‌పూరు, లక్నోలలోని అపార జన సమూహము కాకోరీ ఖయిదీలను సత్కరించు సమయమున నొనర్చిన గగనభేద్యము లగు నినాదములను వినినవా డెవడైన ప్రజ లా ఖయిదీలను హృదయపూర్వకముగ ప్రేమించుటలేదని చెప్పగలడా? నైనీ యందలి సెంట్రల్ జైలుగేటువద్ద 3 రోజుల వరకు ఉదయము సాయంత్రము, కాకోరీ ఖయిదీలను ఎప్పుడు వదలుదురో యను విషయము తెలిసికొనుటకై నవయువకులు కాచుకొని యుండిరి. కాన్‌పూర్ తిలక్ హాలులో రాత్రి 3 గంటల వరకు టెలిఫోన్ ద్వారా కాకోరీ ఖయిదీలు విడుదలపొందిరో లేదో కనుగొనుచుండిరి. ఆ సమయమున 3 దినముల వరకు అచటి ప్రజలు నిద్ర సైతము మానివైచి యీ వార్తను విన కుతూహలము కనుపరచి యుండిరి. యీ రాజకీయ ఖయిదీ లన్న దేశీయ ప్రజల కెంత ప్రేమయో తెలియజెప్పుట కింతకన్న ప్రమాణ మేమి కావలయును? ఇట్టి స్థితిలో దేశీయు లందరు రాజకీయ ఖయిదీలు వెంటనే విముక్తులు కావలె నని కోరుచున్నట్లు స్పష్ట మగుటలేదా? అందుచే ఎన్నికల సమయమునం దొనర్చిన వాగ్దానముల నొకపరి జ్ఞాపకము చేయుచు రాజకీయ ఖయిదీలను సత్వరముగ వదలుటయే సర్వ ప్రథమ కర్తవ్య మని మంత్రులను హెచ్చరించవలదా? దేశీయుల హృదయపూర్వకమగు కోర్కెలను మన్నించి పాలించనచో మంత్రులు తమ కర్తవ్య మార్గమును వదలినవా రగుచున్నారు. కాంగ్రెసు మంత్రి వర్గము లీ సమస్యనే పరిష్కరింపజాలనిచో రాబోవు గొప్ప గొప్ప సమస్యల నెట్లెదుర్కొనవీ లగును?

ఇక ఖైదీలను విడుదల చేయుటలోగూడ భేదభావము గన్పరుపబడెను. కాకోరీ ఖైదీలనందర నొక్కమాటుగ వదలలేదు. తదితర రాజకీయ నిర్బంధితుల గూడ నొక్కపర్యాయము విడుదల చేయలేదు. వీరందర నొక్కపరియే వదలివైచినచో నీసమస్య అప్పుడే పరిష్కరింపబడి యుండెడిది. ఇంతవరకు నీ సమస్య పరిష్కారము కాకుండుటకు కారణభూతు లెవరు? కాకోరి ఖైదీలు 20, 30 సంవత్సరముల పర్యంతము జైలుజీవితము గడపి నేడు ముక్తులైన తర్వాత నింటిలోకూర్చొని సుఖించక, ఇంకను జైళ్ళలో

(తరువాయి 14 వ పేజీ లో)

# ★ స్పానిష్ దేశ ప్రాచీన చరిత్ర ★

## మతము, రాచరికము, ప్రజలకు గావించిన మహాపకారము

కె. సత్యనారాయణ బి. ఎ. (ఆనర్సు) ఓ. యల్.

ఆర్థిక, సాంఘిక, రాజకీయాల్లో వెనుకబడి ఉంచసుకనే స్పెయిన్ దేశం, ప్రస్తుత పోరాటంలో ప్రపంచ వార్తలలో నేడు ముందుకు వచ్చింది. స్పెయిన్ దేశములో రోజు రోజుకు వృద్ధి అగుచున్న ప్రజాస్వామిక శక్తులకు (Democratic forces) ప్రజాస్వామిక వ్యతిరేకమగు ధనిక, సైన్యాధిపతుల, మతాధికారుల సమ్మేళనమగు నిరంకుశ శక్తులకు, ఈ పోరాటం. ఈ పోరాటం, స్పెయిన్ యొక్క అంతః వ్యతిరేక శక్తులకు మాత్రమే సంబంధించినది కాదని, ఇటలీ, జర్మనీ, పోర్చుగల్ దేశాలు ఈ పోరాటంలో కలుగజేసుకొనుచున్న జోక్యం వల్ల స్పష్ట మగుచున్నది. ఫ్రాంకో సేనాని ఆధిపత్యం క్రింద, ఒక నిరంకుశ నియంతృత్వ రాజ్యాంగమును స్పెయిన్ లో గూడ స్థాపించాలని ఇటలీ, జర్మనీల ఆశయం. యుద్ధ ప్రారంభంనుంచి—అంతకు పూర్వం నుంచి గూడా—ఇటలీ, జర్మనీలు ఫ్రాంకో సేనానికి సహాయం చేస్తూనే ఉన్నవి. కనుక ఈ స్పెయిన్ పోరాటమును, ప్రజాస్వామ్యానికి (Democracy) ఫాసిజమునకు జరుగుచున్న పోరాటమని చెప్పటలో ఏమాత్రం అసత్యం లేదు.

ఈ పోరాటమునకు నిజమైన కారణములు: దీని కాని పరిణామం: దీనివల్ల మిగత దేశాలమీద ఫలితాలు: ప్రజాస్వామికం చివరకు జయం పొందుతుందా? ఈ పోరాటం వల్ల మనం నేర్చుకోవలసిన విషయాలేమిటి? వీటిని గురించి చర్చించుదాం.

చారిత్రికంగా, స్పెయిన్ దేశపు చరిత్ర ఒక పీడిత ప్రజల చరిత్ర యని చెప్పవలసి వస్తుంది. ఏనాడు క్రీ. శ. 1492 లో స్పెయిన్, కాథలిక్ రాజుల వశ మయిందో, అప్పటినుంచి స్పెయిను దేశములో ప్రజాసామాన్యం, దుర్భరమగు నిరంకుశత్వం వల్ల పీడింపబడుచున్నది. 1931 లో రాచరికం అంతమొందే వరకూ, కాథలిక్ చర్చి, చర్చి చేతులలో వశమయిన కాథలిక్ రాజులు కలసి, సైన్యమును, నావికాదళమును వశం చేసుకొని, స్పెయిన్ ప్రజాసామాన్యమును మత విషయాల్లోను, సాంఘికముగాను, ముఖ్యముగా ఆర్థికంగా అనేక విధముల బాధలు పెట్టి ప్రస్తుత దరిద్ర స్థితిలోకి తీసికొని వచ్చారు.

### కాథలిక్ చర్చియొక్క నిరంకుశత్వం

కాథలిక్ చర్చికి దేశము నంతను పీడించగల నిరంకుశాధికారం ఎలా వచ్చింది?

ఈ విషయం సమగ్రంగా తెలుసుకొనుటకు స్పెయిన్ దేశపు చరిత్ర కొంచెం గమనించాలి. క్రీస్తుశకం పూర్వం రోమను చక్రవర్తులు స్పెయిన్ మీద దండెత్తి జయించారు. వారే ఈ కాథలిక్ మతాన్ని స్పెయిన్ లో ప్రవేశ పెట్టింది. అంతకు పూర్వమే ఐబీరియనులు, గ్రీకులు, ఫోనీషియనులు, కార్తేజీనియనులు స్పెయిన్ లో ఉన్నారు. క్రీ. శ. 4 వ శతాబ్దంలో రోమను సామ్రాజ్యం నశించిపోయింది. దానితో రోమను చక్రవర్తుల స్పెయిన్ దేశపు పరిపాలన గూడా అంతమొందింది. వెంటనే స్పెయిన్ ఆఫ్రికా వాసులగు మహమ్మదీయుల వశ మయింది. వీరిలో అరబ్బులు, బెర్బరులు ఉండిరి. ఆ రోజులలో అరబ్బులు గొప్ప నాగరికతను కలిగి యుండుట వల్ల, వీరి పరిపాలన వల్ల స్పెయిన్ దేశమునకు చాల లాభములు కల్గెను. మత స్వాతంత్ర్యమునకు ఎప్పుడూ వీరు ఏ అడ్డును పెట్టలేదు. క్రీ. శ. 11 వ శతాబ్దం వరకు వీరి పరిపాలనమే. అప్పుడు ఈ మహమ్మదీయ పరిపాలకులలో కొన్ని భేదములు కల్గెను. ఇదే తరుణ మని, కాథలిక్కులు మహమ్మదీయులను దేశమునుంచి తరిమివేయుటకు యుద్ధం ప్రారంభించారు. చివరకు క్రీ. శ. 1492 లో స్పెయిన్ లో కాథలిక్ ప్రభుత్వం స్థాపించబడెను.

అప్పటినుంచి కాథలిక్ రాజులు, దేశం అంతా కాథలిక్ మతాన్ని ప్రచారం చేసి, దానికే ప్రాముఖ్యత నిచ్చి, ఇతర మతాలను బలవంతముగాను, నిరంకుశంగాను అణగద్రొక్క మొదలు పెట్టారు. కాథలిక్ మతమును ఒప్పుకోని వారిని హింస చేయుటకు ఇన్క్విజిషన్ (Inqusition) అను ఒక నిరంకుశ సంస్థను స్థాపించారు. ఇదే కాదు. కాథలిక్ మతస్థులు కాని వారి ధనాన్ని దోచారు. రాజకీయాల కొరకు మతాధికారాన్ని కేంద్రీకరించడానికి సాగించారు. ఇది స్పెయిన్ దేశములోని విషయం.

ఇక బయట, 1492లో కొలంబస్ అమెరికా దేశాన్ని కనిపెట్టడంతో, స్పెయిన్ రాజులు కాథలిక్ మతం పేరుతో సామ్రాజ్య స్థాపన మొదలు పెట్టారు. 1519 లో మెక్సికో, 1530 లో దక్షిణ అమెరికాలో కొన్ని దేశాలను; 1540లో చిల్లీ దేశం స్పెయిన్ దేశపు వలస రాజ్యాలు అయిపోయినవి. వెంటనే మధ్య అమెరికా, వెనిజులా దేశములు గూడ స్పెయిన్ వశ మయినవి. ఈ కాలనీల నుంచి,దోపిడి పద్ధతుల వల్ల,లెక్కలేనంత ద్రవ్యం స్పెయిన్ దేశమునకు వచ్చేది. ఇదంతా కాథలిక్ రాజులు, చర్చి కలసి రోజు రోజుకు కూడబెట్టుట వల్ల కాథలిక్ మత సంస్థకు ధనిక బలం ఎక్కువ అయినది.

సామ్రాజ్యస్థాపన, వలసరాజ్యాల దోపిడీలో పడిపోయిన కాథలిక్ రాజులు, దేశంలో పరిస్థితినే పూర్తిగా మరచిపోయిరి. కాలనీల దోపిడి వల్ల వచ్చే ద్రవ్యం అంతా రాజులు, చర్చి కలసి మింగటం వల్ల, ప్రజాసామాన్యమున కేమీ లాభములు కలుగక పోగా, రోజురోజుకూ స్పెయిన్ లో దరిద్రం హెచ్చయింది. ఈ విధంగా 250 సంవత్సరములు గడచిపోయినయి.

18 వ శతాబ్దంలో స్పెయిన్ సామ్రాజ్య పతనం ప్రారంభమయింది. దీనికి ముఖ్యమైన కారణం వలస రాజ్యాలలో బయలుదేరిన స్వాతంత్ర్య ఉద్యమాలే. వలసదేశాలు ఒకటి తరువాత ఒకటి స్వతంత్ర దేశాలయిపోయినయి. 1898 తో స్పెయిన్ సామ్రాజ్యం పూర్తిగా నశించి పోయింది. 18 వ శతాబ్దంలో సామ్రాజ్య పతన ప్రారంభము నుంచి,స్పెయిన్ రాజులకు సామ్రాజ్య వ్యవహారము రోజు రోజుకు తగ్గిపోయినయి. చిట్ట చివరకు అంతఃకలహములతోను, స్వేచ్ఛ, స్వాతంత్ర్యము లేక, దరిద్రింతో బాధపడుచు అసంతృప్తి చెందిన ప్రజాసామాన్యంతోను, రోజు రోజుకు అభివృద్ధి పొందుచున్న,ప్రజాస్వామిక,స్వేచ్ఛావాదములతో స్పెయిన్ దేశము మిగిలిపోయింది.

### ప్రజా సామాన్యస్థితి—రైతులు,కూలీలు

దేశములోని భూమిలో, నూటికి 80 వంతులు, 20 వేల భూస్వాముల, జమీందారుల చేతులలోను, చర్చి ఆధీనంలోను ఉన్నది. అందుకనే స్పెయిన్ లో నూటికి 60 మంది, కొద్దిపాటి భూమి గూడా లేకుండా, కూలి మీద ఆధారపడే వ్యవసాయపు కూలీలు, కొద్దిపాటి భూమి గల పేదరైతులకు, వీరికి ఎక్కువ భేదం లేదు. పేదరైతులు, కార్మికులు, వ్యవసాయపు కూలీలు కలసి జనసంఖ్యలో నూటికి 90 వంతులు. భూమి పంపిణీపద్ధతి ఇంకా ఘోరంగా ఉంది. ముఖ్యముగా స్పెయిన్ దక్షిణభాగంలో లాటిఫండియా (Latifundia) అను జమీందారీపద్ధతి అమలులో ఉన్నది. హిందూదేశములోని జమీందారీపద్ధతికన్న అన్యాయమైనది, అక్రమమైనది ఈ లాటిఫండియా పద్ధతి. ఈ పెద్ద ఎస్టేట్లలో పనిచేసే వ్యవసాయపు కూలీల జీవితాన్ని ఎస్టేటుదారుల చేతులలో చిక్కుకొని పోయినయి. ఎస్టేటుదారుల, వారి తరఫున ఉండే మేనేజర్ల, గుమాస్తాల అధికారమునకు హద్దులే లేవు. ఎన్నికల సమయంలో బలవంతపెట్టి, హింసచేసి జమీందారులకు వోటు చేయించుకుంటారు. జరిమానాలకు మితి లేదు. వానికి వచ్చే కొద్ది కూలిలో సగం జరిమానాల క్రింద పోవాలిసిందే.

### భౌతిక సదుపాయములు తక్కువ

స్పెయిన్ దేశం కొండలతోను, గుట్టలతోను, పీఠ భూములతోను, నిండియున్నది. భౌతికంగా వ్యవసాయమునకు సదుపాయములు తక్కువ. వ్యవసాయం పాత పద్ధతులమీద జరగాలిసిందే. కాథలిక్ రాజులు దేశాభివృద్ధికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. నవీన పద్ధతులుగాని, పరిశ్రమాభివృద్ధిగాని స్పెయిన్ లో కనపడవు. అందుకనే వ్యవసాయమే ముఖ్యమైన వృత్తిగా నిలచిపోయింది. వ్యవసాయమునకు అవసరమగు నీటిపారుదల పద్ధతులుగూడ సరిగా లేవు. ఇటువంటి పరిస్థితులలో స్పెయిను ప్రజాసామాన్యమగు పేదరైతుల, వ్యవసాయపు కూలీల ఆర్థికపరిస్థితులు రోజు రోజుకు విషమించినయి.

### రాజకీయ చైతన్యం—లిబరలిజం

ఇటువంటి వాతావరణంలో, పీడితులైన స్పెయిన్ దేశీయులలో లిబరలిజం (Leiberalisim.) రోజు రోజుకూ వృద్ధియయింది. ప్రజ స్వామికవాదం నిప్పులగా దేశమంతా వ్యాపించడం ప్రారంభించింది. 1868 వచ్చేసరికి చాలా బలపడింది. 1811—12 లోనే దండెత్తి వచ్చిన నెపోలియనును ఓడించగానే, స్పెయిన్ దేశస్థులు ప్రజలయొక్క మొదటి పార్లమెంటును స్థాపించారు. చట్ట సమ్మతమైన రాజ్యాంగము స్థాపించుటవల్ల,రాచరికమునకు కొన్నిహద్దులు ఏర్పడినయి. కాని ఇది స్థాపించబడిన వెంటనే ప్రజాస్వామికవాదం (Democracy.) యూరపులో బలపడిపోవుననే భయంతో రష్యా. ఆస్ట్రియా నిరంకుశ సామ్రాజ్యాధికారులు ఒక ఫ్రెంచిసైన్యాన్ని స్పెయిన్ కు పంపించి, పార్లమెంటును నాశనంచేసి, తిరిగి నిరంకుశమగు కాథలిక్ రాజ్యాంగమునే స్థాపింపచేసిరి. 40,000 ప్రజాస్వామిక వాదులు బంధింప

(మిగతా 13 వ పేజీలో)



# ఫాసిస్టులకు బలియైన బల్గేరియా వీరనారి!

## “అన్నా మాయి” విషాద గాథ

అన్నామాయి 1921 లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ మహిళాసంఘం ద్వారా మార్చి 8 వ తేదీని అంతర్జాతీయ మహిళా దినంగా పరిగణింపవలెనని ప్రోత్సహించింది. అనాడు రష్యాలో లెనిన్ గ్రాడు నుంచి స్త్రీలు పోరాటంలో దుమికారు.

అన్నామాయి బల్గేరియా వాస్తవ్యురాలు.ఆమె తన యౌవ్వనంలోనే తలిదండ్రుల వితనాడింది. ధనికుల [illegible] తన కుటుంబంతో సంబంధం లేకుండా ఒక [illegible]ల టీచర్ గా పని చేసింది. ఆమెకు కార్మికులంటే ఎంతో అభిమానము. కష్టపడేవారికి తనజీవితం అర్పించాలని ఆమె దృఢ మనస్కురా లయింది. తన జీవితాన్ని వారికష్టాలతో కలిపి సాగించింది.

బల్గేరియాను నాయకుడు, సోషల్ డెమాక్రటిక్ పార్టీ సంస్థాపకుడు "బ్లాగోయావ్" ఆమెకు గురువు. ఆమె ఆ గురువు ననుసరించింది. పార్టీలో చీలికలు కల్గినపుడు ఆమె "టిస్న యాకి" అనే పార్టీలోకి చేరింది. ఈ పార్టీ తర్వాత కమ్యూనిస్టు పార్టీగా మారింది.

1905 లో బెల్జియం వెళ్ళింది. ఊరికే చదువు సంధ్యలతోనే కాలంపుచ్చలేదు. రష్యావిప్లవం జూచి బెల్జియంలో గూడ సమ్మెలు, చెలరేగాయి. అన్నామాయి వాటిలోకూడ పాల్గొన్నది. ఆమె మళ్లా బల్గేరియాకు వెళ్లాక ప్రతిపల్లె, పట్టణం తిరిగింది. పాశ్చాత్య దేశాలలోని శ్రామికులలోని కదలికను విప్లవాన్ని గురించి ఉద్బోధించింది. ఎప్పుడూ ప్రజలమధ్య పని చేస్తూ, కమ్యూనిస్టుపార్టీలో పలుకుబడి సంపాదించింది. 'స్లావదినా' పార్టీకి సెక్రటరీ అయింది.

అన్నామాయీ ముఖ్యంగా వెనుకబడ్డ కార్మికులలో. అంటే ముఖ్యంగా స్త్రీలలో శ్రద్ధ తీసుకొన్నది. 19[illegible] లో బాల్కన్ యుద్ధం జరుగుతుంటే [illegible] [illegible]లెన్నో జరిగాయి.

[illegible] 'టిస్నయాకీ' [illegible] [illegible] అన్నామాయీ.

1915 లో బల్గేరియా ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధంలో చిక్కుకున్నప్పుడు 'శాంతి, తిండి' కావాలంటూ బల్గేరియన్ రైతుల స్త్రీలు అందోళన చేశారు. ముఖ్యంగా అన్నామాయీ ఉన్నచోట్ల మరీ అలజడి కల్గింది. ఇలా రైతులస్త్రీలు, పట్టణాలలో కార్మికుల స్త్రీలు అందోళన చేయడంతో సైనికులలో అశాంతి ప్రబలింది.

1919 లో 'టిస్నయాకీ' పార్టీ అంతర్జాతీయ కమ్యూనిష్టుపార్టీ శాఖగా మారినపుడు అన్నామాయీ స్త్రీల కమ్యూనిష్టు పేపరు 'ఈ క్వాకట్' పత్రికను ఎడిట్ చేసింది. ఫ్యాక్టరీలలోని స్త్రీ కార్మికులే ముఖ్యంగా ఉన్నచోట్ల పెద్ద సమ్మెలను సంఘటనం చేసింది.

బల్గేరియాలో 1923 సెప్టెంబరులో కార్మిక కర్షకుల తిరుగుబాటు జరిగినపుడు, చాలామంది స్త్రీ కార్మికులు, రైతులు, ఉపాధ్యాయులు అన్నామాయి శిష్యులు, ధైర్యంగా ఆయుధాలతో పోరాడారు, వార్తలు నందజేసే ఉద్యోగంలో తమ ప్రాణాలనుసైతం లెక్కచేయలేదు.

సెప్టెంబరు విప్లవం అణగిపోయింది. కాని అన్నామాయి రహస్యంగా దాక్కొని తనపని మామూలుగా చేయ ప్రారంభించింది.

1925 ఏప్రియల్ లో ఫేసిస్టులు రెచ్చగొట్టా[illegible] సోఫియాచెర్చిని పేల్చివేశారు. అన్నామా[illegible] వందలకొంది కమ్యూనిష్టులు ప్రభుత్వంచేతి[illegible] జైళ్ళలో ఆమెనునానావిధాల హింసపెట్టా[illegible] చారు. ఆమె చలించలేదు. [illegible] మాట కూడా [illegible] [illegible] చెప్పలేదు. [illegible] ఒక వార్డరు [illegible] పిలిచి "ఆమె [illegible] కన్పించుచున్నది. [illegible] సెల్లు ఇవ్వు" అని అన్నాడు. [illegible] అన్నామాయి బ్రతికిగాని, చచ్చిన శవము గాని [illegible]చలేరు....

# ముస్సోలినీ ట్రిక్కులు

## ఫ్రాంకోకు అరబ్బుల సహాయం

★ ★ ★

డైలీహెరాల్డ్ పత్రికలో జిబ్రాల్టర్ విలేఖరి ఇలా వ్రాస్తున్నాడు.

"ఇస్లాం సంరక్షకుడను" అని తనంతకు తానే తప్పా వాయించుకొనే ముస్సోలినీ ఉత్తర ఆఫ్రికా నుండి వేలకొలది అరబ్బులను ఫ్రాంకో సహాయార్థం పంపుతున్నాడు.

మూర్ సైనికులు స్పెన్ లో దెబ్బ తినటం వల్ల చాలామంది తగ్గారు. మళ్ళా అక్కడ క్రొత్త దళాల్ని పోగుచేయడం కష్టం. అందుకని ట్రిపోలీనుండి, లిబియానుండి అరబ్బులను పంపుతున్నాడు.

ఇటాలియన్ ఆఫీసర్లు వారితో ఫ్రెంచి మొరాకోలోని 'ఫెజ్' నగరంవద్దనున్న 'ములాలీ ఇద్రిస్' మశీదును చూపించుతాని వడవెక్కించుతారు. వారా నగరం చేరనే చేరరు. బహూశా సార్డీనియా గుండా మెలీలా చేరుతారు.

మెలీలావద్ద విదేశ సైనికులలో చేర్పించుతారు. రోజుకు ఎక్కువ ధనం కూలీగా ఇస్తారు.

సుమారు 778 వేలమంది మూరిష్ వేషంతో ట్రిపోలీ అరబ్బులు విద్రోహులవద్దను ఈపది హేను రోజులలోను చేర్చబడ్డారు.

స్పానిష్ వర్తకనౌకలు, ఇటాలియన్ నౌకలు అరబ్బులను చేర్చినవి. ఇటాలియన్ నౌకలకు యుద్ధనౌకలు లాగా బూడిదరంగు పూసారు. కాని పేరులేమీ వ్రాయలేదు.

రాత్రిళ్ళు, మెలీలానుదాటి, కాడిజ్ మలాగాలకు చేర్చారు.

[illegible]రహస్య వాయువిమాన ప్రయాణంకూడ ట్రిపోలీకి, మెలీలాకు సాగింది. అలాంటిదే మెలీలాకు కాడిజ్ కు, మరో సర్వీసుఉంది.

ములాలి ఇద్రిస్ ఆదర్శప్రాయుడైన మౌలీ, అతని గోరీ ఒకపవిత్ర మశీదు. ఆప్రాంతాల యూదులగాని, క్రిస్టియన్లగాని రానీయరు ప్రతి అరబ్బుకు ఆమశీదుని దర్శించడానికి ఎంతో ఆశఉంటుంది."

ఇలా మశీదుకని చెప్పి, మహాయుద్ధంలో మరణానికి పంపుతున్నాడు ముసోలినీ అరబ్బులను.

# ★ మంత్రిగారి మారువేషం ★

అలహాబాదులోని హిందీ మాసపత్రిక 'సరస్వతి' ఒక కథ బయట పెట్టింది.

ఒక సబ్ యినస్పెక్టర్ దగ్గర, చేతులు ముడుచుకొని వినయంగా నిలబడ్డాడు ఒకాయన

ఇనస్పెక్టర్: ఏమిటి

అతడు: సర్కార్, నేను రిపోర్టు చేయడానికి వచ్చానండి.

ఇనస్పెక్టర్: ఏమి రిపోర్టు.

అతడు: నా దూడ ఒకటి పోయింది సార్.

ఇనస్పెక్టర్: ఫో! ఎక్కడో మేతకు పోయి ఉంటుంది. వెళ్ళిపో. (బిగ్గరగా అరుస్తాడు)

అతడు: (మరీవినయంగా) బాబూ. బాగా వెదికానండీ.

ఇనస్పెక్టర్: (కఠినంగా) రిపోర్టు వ్రాయడం—మీ దూడలను మేము వెదకడమూనా? మేమేం మీ నౌకర్లమా. ఫో అవతలికి.

అతడు: అయ్యా. దూడ బాగా బలసిందండి. చిన్నదండి. దయ ఉంచండి.

ఇనస్పెక్టర్: ఇది పోలీసు స్టేషన్. కాంగ్రెస్ ఆశ్రమం కాదు. అర్థమయిందా? ఏమైనా ఇలా పడేయి. లేకపోతే కాళ్ళకు బుద్ధిచెప్పు.

అతడొక రూపాయి ఇవ్వ బోయాడు.పుచ్చుకోలేదు బేరం నాల్గు రూపాయల వరకూ పోయింది. ఆయన నాల్గు రూపాయలు ఇచ్చాడు.

ఇనస్పెక్టర్: నీ పేరు?

అతడు: జగల్ చౌదరి.

ఇనస్పెక్టర్: నీ కులం.

అతడు: "పాసీ"

ఇనస్పెక్టర్: నీ వృత్తి ఏమిటి.

అతడు: మినిస్టరీ.........(మంత్రిత్వం)

ఇనస్పెక్టర్: ఏమిటి? మిస్త్రీయా?

అతడు: కాదు బాబూ, మినిస్టరీ అండి.

ఇనస్పెక్టర్ (ఆశ్చర్యంతో) ఏమి మినిస్టరీ?

అతడు:—ఔను. బాబూ. ఎక్సైజ్ మినిస్టర్ని.

ఇనస్పెక్టర్ (భయంతో)

ఊ: ఏమి....ఏమంటున్నారు.

అతడు: (కఠినంగా) ఏమిటా? నేను ఎక్సైజ్ మినిస్టరును, అర్థమయిందా? నాదూడ....

ఇనస్పెక్టర్: (త్వరగా, నిలబడి)

మీరు—యువర్ ఆనరు....సర్కార్....హానరబుల్ మినిష్టర్ జగల్ చౌదరీ....

అతడు: ఆ. అవును.

సబ్ ఇనస్పెక్టర్ గడగడ లాడిపోయాడు. అతని మీద అనేక రిపోర్టులు రావడం విని బీహార్ మంత్రి జగల్ చౌదరి మారువేషంతో పోయి పై నాటకం ఆడాడు. ఇనస్పెక్టరును క్షమించి ఇకపైన అలాంటి పనుల్ని చేయవద్దని హెచ్చరించారు.

# రాజమండ్రి రైల్వే కార్మికులు

యం. యస్. యం రైల్వే బెజవాడ కార్యస్థానము తరువాత రాజమండ్రి పోకటి. ఇచ్చట వకశాఖా గారము ఉన్నది. దానిలో సుమారు ఎనిమిది వందలు మందిశాఖా కార్మికులు ఉన్నారు. సుమారు వందమంది ట్రాయివర్లు, షైనుమెన్‌లు, క్లీనర్లు యున్నారు. యీ తరంతివారు యింజనులు నడిపించుటను పోవుచూ వచ్చుచూ యుందురు. వీరిలో చాలామంది ఆంగ్లో యిండియనులు, సుమారు అయిదువందలు బాయిలరు మేకరులు, ఫిట్టర్లు, ఫిట్టరు కూలీలు, మేస్త్రీలు, క్లీనర్లు యున్నారు. వీరిలో చాలామంది రోజువారీ కూలితరగతిలో చేరినవారు. ఆదివారము వీరికి జీతము యివ్వరు. నర్వీసుయొక్క భాగము గాని, జీవితముయొక్క పూచీగాని యుండదు. ఎన్ని సంవత్సరములు పనిచేసినా యిల్లే యుండును. వీరికి దినమునకు ఎనిమిదిగంటలు నిర్ణీతమయిన పని. తరువాత ఓవరుటయిము అవసరమయినట్లు చేయించుదురు. నామమాత్రము వోవరుటయిము అలవెన్సు యిచ్చుదురు. ఎంతపని చేసినను వీరికి నాలుగు ఆదివారాలు పోను నెలకు యిరవయి ఆరు రోజులుకూ సుమారు ముప్పయి రూపాయిలు రావేగాని అంతకన్న పయినవచ్చుట అరుదు. దానిలో నెలకి 100 కి 10 రూపాయిలు చొప్పున యింటి అద్దె మినహాయింపుదురు. వీరిలో చాలామంది రైలు కంపెనీ క్వార్టర్సులో అద్దెయింట్లలో యుంటూ యున్నారు. కొంతమంది రాజమండ్రి పెద్దస్టేషనుకు, దక్షిణమయిన తూర్పువక్క క్వార్టర్సు యున్నవి. యిన్ని బ్లాకులక్రింద యున్నవి. వక్కొక్క బ్లాకులో 12 కుటుంబములు యుండుటకు నిర్ణయించబడ్డవి. రెండుబ్లాకుల తరువాత వెనకాల సుమారు 10 గజములు ఖాళీయుండి తరువాత బ్లాకులు ఉన్నవి మొత్తం యిచ్చట 161 కుటుంబములు నివసించుచూయున్నారు. రోజువారీ కూలీలవి. ఒక్కొక్క కుటుంబమునకు యిచ్చు పోర్షను, వకగది. (రెండు మంచములు వేసుకొనుటకు చాలదు) చిన్న వరండా, వంట వండుకొనుటకు. చుట్టూ పిట్టగోడ, ముందర వకద్వారము, బ్లాకు బ్లాకుమధ్యన పాయకానాలు యున్నవి. యిండ్లు నేలమట్టమునకు యున్నవి. లోపల క్రింద గచ్చుగాని, రాయిగాని లేదు. వర్షాకాలం చుట్టూ నీళ్ళు నిల్వయుండుటచే చాలా చెమ్మగిలి యుండును. యీ క్వార్టర్సుల యందు యున్నవారిలో చాలామంది కుటుంబములు వక్కంటికి ఆరుగురు, ఎనమండుగురు, పది మంది కూడా యుంటూ యున్నారు. వకరిద్దరు ముసలివారు గాని, విధవ అక్క చెల్లెండ్లు గలవారుగాని కొంచముబాగా వార్ధక్యము వచ్చి పుత్రులుగాని యున్నవారు పడుచున్న బాధ చెప్పతరముగాదు. ఇండ్లయందు వేసవికాలములో ఎండ అంతయు యింటిలో యున్నవారిపాలు. కప్పుదగ్గర యుండుటవల్ల బంగాళా పెంకులు అవుటవల్ల పెంకుకూ పెంకుకూ మధ్యయున్న రంధ్రములుగుండా చలికాలములో బాగుగాచలి, ఎండాకాలములో బాగుగా గాలువు యింట్లో తాండవమాడుచుండును.

బ్లాకుకూ బ్లాకుకూ మధ్యయున్న పాయికానాలు రోజుకు వక్కమారు శుభ్రముచేయుచుందురు. యిందు డబ్బాలు పద్ధతి నయిన కట్టుబడియున్నది గాని డబ్బాలు ఉపయోగమో పడ్డబడుటలేదు. మాత్రము పోవుటకు వేరుగా కాలువగాని యుండి గాని లేకపోవుటవల్ల మలమూత్రములు రెండుకలిసి మురుగునీరు రెండు వర్ణ కూ ఆ పాయకానా మురుగు కంపుతో యీగలు దోమలతో యుంటూ యుంటుంది. యీ పాయకానాకు చాలా దగ్గరలో ఉత్తరం వైపున బ్లాకుయొక్క పడక గదుల కిటికీలుయున్నవి. అనగా యింటి దక్షిణం ప్రక్క కిటికీ దగ్గరలో పాయకానా దొడ్డి వయి పరిస్థితిలో యున్నవి. యివి డాక్టరులుగాని శానిటరీ ఆఫీసర్లుగాని చూచుచున్నట్లు తోచదు.

నీళ్ళవిషయం చూస్తే చాలా ఘోరంగా ఉన్నవి. యీ క్వార్టరులలో సుమారు వెయ్యిమందినూట ఆరువయి వక్క కుటుంబములలోను యుంటారు. యింతమందికి నాలుగు అంగుళాల ధారవచ్చు కొళాయిలు యున్నవి. వేసవికాలము యందు వీరి దుస్థితి వర్ణించుటకు చెప్పరానిది.

బాలుర విద్య విషయం, యిచ్చట ఎలిమెంటరీ పాఠశాల అయినాలేదు. వీరి బాలురను చదివించాలంటే పెద్దస్టేషను వద్దయున్న మునిసిపాలిటీ పాఠశాలకు పోవలయును. అది సుమారు రెండు మూడు ఫర్లాంగులు ఉండును. అదియూగాక రాజమండ్రి పెద్దస్టేషను అవుటవల్ల రైళ్లు యింజనులు వచ్చుచూ పోవుచూ యుండును అట్టిపరిస్థితిలో వీరి బాలురు ఆ రైలులైనులు మీదుగా బడికి పోవలయును. ఎలిమెంటరీ స్కూలువిద్య కూడా వారు నోచుకొన్నట్లు తోచదు.

ఇచ్చట పనివాళ్లయొక్క యూనియన్ స్థాపించబడినది. చాలామంది చేరిరి. కొద్దిరోజులలో విద్యమంది మెంబరులు సంఖ్య పూర్తి అగునని నమ్ముచున్నాము.

[ ఒక కార్మికుడు. ]

## బెజవాడ ప్రెస్‌వర్కర్సు యూనియన్

ది 23—1—38 ఉదయం [illegible] బెజవాడ ప్రెస్‌వర్కర్సు యూనియన్ ఆఫీసులో బెజవాడ ప్రెస్‌వర్కర్సు యూనియన్ సాధారణ సమావేశము జరిగినది. సభకు దాసరి చిన అప్పలస్వామిగారు అధ్యక్షత వహించిరి

గతసంవత్సరము యూనియన్ అభివృద్ధికై శ్రద్ధతో కృషిచేసిన అధ్యక్ష కార్యదర్శులను అభినందించుచు తీర్మానము గావింపబడిన పిమ్మట రాబోవు సంవత్సరమునకు కొత్త కార్యనిర్వాహకవర్గపు ఎన్నికలు జరిగెను.

అధ్యక్ష స్థానమునకు దాసరి అప్పలస్వామి గారు అత్యధిక సంఖ్యాకులచే యెన్నుకోబడిరి.

ఉపాధ్యక్షులుగా వీణారంగా రావుగారును, ప్రధాన కార్యదర్శిగా చొక్కాపు క్రిష్ణమ్మగారును, ఆఫీసుకార్యదర్శిగా మున్నంగి మల్లిఖార్జునరెడ్డిగారును, సహాయ కార్యదర్శిగాను కోటాధికాంగాను యస్. సోమేశ్వరరావుగారును ఏకగ్రీవముగా యెన్నుకోబడిరి. ఆటు పిమ్మట 8 గురు కార్యనిర్వాహకవర్గమునకెన్నుకొనిరి.

జీతములు సరిగా ఇచ్చుటకై ప్రెస్‌యజమానులను కోరవలయునని గుడివాడ యూనియన్ అధ్యక్షుల మరణమునకు సంతాపమును తెల్పుకొన్ని తీర్మానములుచేయబడెను.

చొక్కాపు క్రిష్ణమ్మ,
కార్యదర్శి.

## కొడాలి
### చేనేత పారిశ్రామిక సభ

దివి తాలూకా కొడాలి గ్రామమున ది 21 వ తారీఖున రాత్రి 7 గంటలకు శ్రీయుత సుమ్మడి వెంకట సుబ్బయ్యగారి అధ్యక్షతను చేనేత పారిశ్రామిక సభ జరుపబడెను. ఆంధ్రరాష్ట్ర నేత పారిశ్రామిక సంఘ కార్యదర్శిగారైన శ్రీయుత పెండెం వెంకటాద్రిముఖి గారు చేనేత పరిశ్రమాభివృద్ధిని గురించి విపులముగా నుపన్యసించిరి. యీక్రింది తీర్మానములు సభలో ఏకగ్రీవముగా వాసాంచిపబడెను.

**తీర్మానములు**

1. చెన్నరాష్ట్ర ప్రభుత్వమువారు మిల్లుబట్టల వ్యాపారులమీద విధించిన లైసెన్సు రుసుము చాల తక్కువగనుక రు 2 లు రు 20లగాను రు 5 లు రు 50 లుగాను విధించవలెనని యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు

2. బందరు కాపురస్థులు బట్టల వ్యాపారస్థులు అయిన కంతేటి అంజనేయులుగారు కొందరి చేనేత పారిశ్రామికుల మీద అక్రమముగా క్రిమినల్ చార్జీలు పెట్టి జైళ్ళపాలు చేసినందులకుగాను యీ సభవారు తమ అసమ్మతిని దెలుపుచున్నారు.

3. కొడాలి గ్రామమున వస్త్రనిర్మాతలు గల వీధులయందు పడుగులు చేయుకుండా ఆటంకపరచుటచేత చాల కష్టనష్టములు గలుగుచున్నవి. కనుక యిదివరటివలె పడుగులు చేసికొను నవకాశము చట్టరూపమున కలుగజేయవలసినదిగా ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు.

## హరిజనగృహాలు అగ్నిపాలైనవి

[illegible]—1—1938 తేదీ, [illegible] కొండంగి గ్రామ [illegible] వాడపూర్తిగా [illegible] అయ్యెను, [illegible] పాటలైనా [illegible] ఈరోజులలో [illegible] వుంటూ 3 పూటలకు వక్క [illegible] గంజిలేకమలమల మాడుచున్న రోజులలో గృహములు కాలిపోవుట చాలా దుఃఖకరము. [illegible] అభిమానులు దయచేసి వక్కసారి [illegible] కొండంగి హరిజనవాడమీదకు పో[illegible] వాములు తిరిగి పునరుద్ధరింపగోరెదను. [illegible] చాడమంగయ్య పంతులుగారు, [illegible] యీ బీదహరిజన సోదరులకు పెట్టించి, వారిని [illegible]చుచున్నాను. వారివలెనే అభిమానులు [illegible] ధనరూపకముగా ధాన్యరూపకముగా [illegible] ప్రార్థిస్తూయున్నాను.

[illegible] ఆదరించవలెను.

ఇట్లు
[illegible]గంటి నారాయణరావు
కొండంగి పోష్టు
తూ. గో. గోదావరిజిల్లా



★ ఫాసిస్టు విజృంభణ

★ రష్యా వ్యవసాయ అభివృద్ధి

# నేటి ప్రపంచం

★ స్పెయిన్ యుద్ధం

★ చీనా జపాన్ యుద్ధం

నాజీ జర్మనీ నవ వార్షిక ఉత్సవం జరిగింది. గోబెల్సు మాటాడుతూ "మనదేశం బలపడింది. మన గౌరవం హెచ్చింది. మన జాతి పునరుద్ధరింపబడింది. మన కలలు నిజమైనాయి" అని అన్నాడు.

ఈరోజుల్లో 'బ్లఫ్' కొట్టడం — అంటే బుకాయింపు — రాజకీయాలలో ప్రసిద్ధి కెక్కింది. ఇందులో ఫాసిస్టులు మొదటివాళ్ళు.

1933 కీ 1938 కీ భేదం ఏమిటీ? అప్పుడు లేని జాతీయఐక్యత హెచ్చింది. నిజమే. కమ్యూనిస్టు సంఘాలు, ట్రేడ్ యూనియనులు చివరకు మొన్న మొన్ననే కేథలిక్ సంఘాలు నిషేధింపబడినయి. 'అన్నీ నిషేధించి మనం ఐకమత్యంగా ఉన్నాం' అని డబ్బా వాయించుకోవచ్చు. నిరుద్యోగం తగ్గింది. ఎలా? ఆడవాళ్లందరినీ వంట ఇండ్లలో కుక్కి వారి ఉద్యోగాలు మగాళ్ళకు ఇవ్వడంవల్ల — స్పైన్‌లో వలంటీర్లను బంపి చంపడంవల్ల — యువతీయువకులను కాన్‌సెంట్రేషన్ క్యాంపులలో నిర్బంధించడంవల్ల, ఎదిరిపార్టీల వారిని గొడ్డలితో శిరచ్ఛేదనం చేయడంవల్ల, ఇదంతా అభివృద్ధికాదూ? దేశం గర్వింప దగిన విషయంకాదూ? అయినా ఇలాంటి దేశాభివృద్ధి ప్రజాస్వామ్యం కోరే మనలకు వద్దు.

హిట్లర్ తన వలసరాజ్యాలు కావాలని బెదరింపులు—చేశాడేగాని చేతిలోపడ్డదేమీ లేదు. ఆర్యజాతి వాడపటంవల్ల కాబోలు ఇండియామీదకూడ కన్నువేశాడని వదంతి. 1535 లో పోర్చుగీసు వారాక్రమించు కొన్న అరేబియాఘాతంలోని 'డియూ' దీవిని కొంటారని ఒకవదంతి పుట్టింది. ఇది అబద్ధమంటూ జర్మని రాయబారి బొంబాయిలో చెప్పాడు. పోనీ [illegible]క్షించాడు ఇంగ్లీషువారిని మహానుభావుడు....

### మధ్యయూరప్‌లో ఫేసిజం

జర్మనీ ఇటలీలతో ఫేసిజం ఆగలేదు. జపాను మిలటరీ ఫేసిజం అవలంబించింది. పోలండ్, ఆస్ట్రియాలుకూడ ఫేసిస్టు దేశాలే. పోతే ఇపుడు క్రొత్తగా ఫేసిస్టు అవతారం దాల్చినవి రుమేనియా, బల్గేరియా, గ్రీసు బ్రెజిల్ దేశాలు,

రుమేనియాలో అపుడే వేలకొలది యూదుల బహిష్కారం సాగిపోతూనే ఉన్నది. బల్గేరియాలో 'కింగ్ బోరిస్' తన మంత్రిని—గట్టిమనిషి—అని బిరుదుపొందిన యుద్ధమంత్రిని జనరల్ 'టాకో' ను తొలగించాడు. ఇప్పుడప్పుడే నియంతృత్వం తొలగదనీ ఫాసిజమే పరిపాలిస్తుందని తలుస్తున్నారు.

గ్రీసులో జనరల్ 'మెటాక్సస్' నియంతృత్వం స్థాపించాడు, అయినా "రాజ్యం కఠినరూపము తాల్చినదనడం పొరపాటు" అని అధికార ప్రకటన. అయితే పార్లమెంటు సభ్యులను అరస్టుచేయడం—వారిని పల్లెటూళ్ళలో 'ఇన్‌టరన్' చేయడం దేనికి? సుమారు 15 మంది సభ్యులను దీవులకు ప్రవాసం పంపడం దేనికి? ప్రభుత్వ ప్రకటనమే తెల్పుతున్నది. "సామాన్య ప్రజల క్షేమముకోరి" యట! పాపం ప్రజాక్షేమం కోరే, లిబరల్, మానార్కిస్టు, ప్రోగ్రెసివ్, ఇండిపెండెంటు రిపబ్లిక్‌పార్టీ పార్లమెంటు సభ్యులను అరస్టు చేసింది. ఫాసిస్టు నియంతృత్వంలో ప్రజాక్షేమానికి తావెక్కడిది?

ఇపుడు ఇటలీగుండా ఒకడు ప్రయాణంచేస్తే అడ్డులేకుండా జర్మనీ, పోలండ్, రుమేనియా, బల్గేరియా, గ్రీసు—అన్నీ ఫేసిస్టు దేశాలగుండానే—ఒక సర్కిల్ కొట్టవచ్చు. ఇలాచుట్టూ ఫేసిస్టుదేశా లయిపోవడం వల్ల లిటిల్ యంటెంటీల అవస్థ కష్టమయినది. ఇక దక్షిణ అమెరికాలోని బ్రెజిల్‌లోని ఫేసిజం చూదాం.

### బ్రెజిల్‌లో ఫేసిజం.

యూరప్‌లో 4/5 వంతు ఉంటుంది బ్రెజిల్. దాదాపు బ్రిటిష్ దీవులలోని జనాభా అంత ఉంటారు. సహజ సంపదలు—ముడివస్తువులు కూడా విరివిగా దొరుకుతాయి బ్రెజిల్‌లో.

బ్రెజిల్ డిక్టేటర్ పేరు, "గెటూలియో, వార్గాస్." ఇతడుకూడా మొదట్లో బ్రెజిల్‌లో "ఫాసిజం స్థాపించడం లేద"న్నాడు. కాని సిద్ధాంతాలను "జాతీయ, సాంఘికాచారాలకు లోబడి ఉండాలని" అన్నాడు. చివరకు "నేషనల్ సోషలిజం" వంటి పద్ధతులు అవలింబించాడు. అంటే జర్మనీకి హిట్లర్ ఉంటే, బ్రెజిల్‌కు వార్గాస్ ఉన్నాడు. ఒక డిక్రీతో, ఫెడరల్ కాంగ్రెస్‌ను, స్టేటు అసెంబ్లీలను, రద్దుచేసి 'కార్పరేటివ్‌స్టేటు' అంటే ఫాసిస్టు నియంతృత్వం స్థాపించాడు. ఇలా ఫేసిస్టు ప్రభుత్వం స్థాపించడానికి ఇతగాడికీ ఒక సాకు దొరికింది.

1936 లో దేశంలో ఒక విప్లవం లేచింది. అది కమ్యూనిజమే అన్నాడు. అధికారాలన్నీ తానే గ్రహించాడు. ఎన్ని ప్రకటనలుచేసినా — వార్గాస్ యూరోపియన్ ఫాసిస్టుల సహాయం సానుభూతి పొందుతున్నాడన్నమాట నిర్వివాదాంశం.

### అబిసీనియా తిరుగుబాటు

ఈవారం ఎందుకనో ముస్సోలినీకి మంచి రోజులు కానట్లున్నాయి. అబిసీనియాలో తిరుగుబాటు జరిగింది. చాలా రాష్ట్రాలలో యుద్ధం జరుగుతున్నది. 6 వేలదాకా ఇటాలియన్ ఆఫీసర్లు చచ్చారట. రోజూ తిరుగుబాటు నణచాలని 40 ఇటలీ విమానాలు పని చేస్తున్నవట. ఈవార్తలన్నీ ఇటలీ మొదట నిరాకరించింది, కాని రోములోని అధికారపత్రికలే నిజమేనని ఒప్పుకోవాలసి వచ్చింది.

### లిబరల్సు వేదాంతం

ఫాసిజంను ఎదుర్కొటానికి కమ్యూనిస్టులు, సోషలిష్టులు, లేబర్‌పార్టీలు చేతులు గలపడం సహజమే. కాని 'లిబరల్ బూర్జువా' అయిన లాయిడ్ జార్జి వంటివారు కూడ నియంతృత్వాన్ని ఎదొర్కొంటున్నారు. ఏదో ఉత్సవంలో మాటాడుతూ "ఇపుడు ముసోలినీ ఎంత హుంకరిస్తున్నా, ముందు మానవాభ్యుదయం అంతా ప్రజాస్వామ్య దేశాల నడవడికను బట్టి ఉంటుంది" అన్నాడు. ఇలాంటి ప్రతిఘటనే అమెరికాలో ఇక్స్ అనే ఆయనకూడా చేశాడు. ఇక్స్ మాటాడిన సభ యునైటెడ్ పాలస్తయిన్ అపీలు కొరకు చేయబడింది. "తమదేశంలో నిరంకుశంగా, క్రూరంగా జాతి, మత, రాజకీయ పక్షాల్ని అణచేవారు ఇతరదేశాలకు మంచి పొరుగువారు కాలేరు; ప్రజల కష్టార్జితమైన ఆర్థికాధికారం కొద్దిమంది చేతిలో పడినపుడు ప్రజాస్వామ్యానికి భంగం కల్గుతుంది." బహుశా ఈయన మనస్సులో ముస్సోలినీ ఉండి ఉంటాడు. ముస్సోలినీ పాలస్తయిన్‌లో అరబ్బులకు సానుభూతిగా బ్రిటనుకు ఎదురుగా హడావిడి చేస్తున్నాడు. ఇదంతా నాటకమని ఆతని అభిప్రాయం.

లాయిడ్ జార్జి నియంతృత్వాల్ని ఎదుర్కొంటూ, ఫేసిస్టు కమ్యూనిస్టులను కలిపేశాడు. దీనికి కారణం బ్రిటన్, అమెరికాలు నేడు తమ బూటకపు ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టుకోవాలని 'లిబరల్ బూర్జువా' ల అభిప్రాయం. ప్రజాస్వామ్యం కోరే లాయిడ్‌జార్జి ప్రపంచయుద్ధంలో ఎన్నో వలసరాజ్యాల దిగమ్రింగాడు. ఇపుడులిబరల్ వేదాంతులంతా పాడేపాట "మాకు ఫాసిజం వద్దు, కమ్యునిజంవద్దు" అని. కాని నిజమైన విరోధం నియంతృత్వానికీ, ప్రజాస్వామ్యానికీ గాదు. జాన్ స్ట్రాచీ చెప్పినట్లు "నిజమైన పోరాటం నియంతృత్వం ప్రజాస్వామ్యాల మధ్యగాదు. సామ్రాజ్యవాదానికి సామాన్య ప్రజలకు మధ్యనే విభేదం." ఈ మాట అనేసరికి సామ్రాజ్యవాదతత్వం లేని దేశాలు ఏవి? ఒక్క రష్యాయే....

### రష్యా

రష్యా సామ్రాజ్య వాదతత్వం విడిచి పెట్టింది. తన ఇల్లును తాను చక్కబెట్టుకోసాగింది. జార్ నిరంకుశల పాలనక్రిందనున్న దేశాలకుకూడ స్వాతంత్ర్యం ఇచ్చింది. దేశంలో విప్లవంవల్ల ఎంత అభివృద్ధి చెందినదో ఈ లెక్కలే తెల్పుతున్నాయి. "1008 తొంబది మూడు పాళ్ళ రైతులు, 243,700 సమిష్టి వ్యవసాయ సంఘాలలో చేరారు. 367,000 దున్నే యంత్రాలు, 105,000 కోత కోయు యంత్రాలు, ఇంకా వ్యవసాయానికి సంబంధించినవి వేలకొలది యంత్రసామగ్రి మాకు ఉన్నది. 1937 సంవత్సరపు పంట 113 మిలియన్ల టన్ను లుంటుంది." అంటూ వ్యవసాయ కమిసారు యం. ఈఖే తెలియ జేసాడు. అయితే తనపైన దుమికేవారిని రక్షించుకోకుండా ఊరుకోవడంలేదు.

కొందరు విదేశీయులు సోవియట్ తూర్పు ప్రాంత్రాల సంచారంచేసి "చైనామైల్" లో ఇలా వ్రాశారు. "వ్లాడివాస్టక్ ప్రాంతాన సుమారు 100 జలాంతార్గములున్నవి. ఇంకా ఎన్నో వచ్చి చేరుచున్నవి. సముద్రతీర రక్షణకు ఏర్పాట్లు జరుగుచున్నవి. విమానాశ్రయములు మరికొన్ని నెలకొల్ప బడుచున్నవి." దీనిని బట్టి ఆత్మరక్షణకు రష్యా ఎపుడూ సిద్ధంగానే ఉన్నది.

### స్పానిష్ యుద్ధం

టెరూల్‌వద్ద యుద్ధం నెలనుండి జరుగుతున్నది. మొత్తంమీద ప్రభుత్వ విజయాలే ఎక్కువగానున్నాయి. యుద్ధరంగానికి ముఖ్య ప్రదేశాలు లామ్యూలా, సాం

( మిగతా 10 వ పేజీలో చూడుడు. )

# నవశక్తి

2—2—38 బుధవారము

## ఋణ నివారణ చట్టం.

1930 వ ప్రపంచ ఆర్థిక దుస్థితి అన్ని దేశాలకంటె ఎక్కువగా భారతదేశానికి పెద్ద దెబ్బ కొట్టింది. భారతదేశ వ్యాపారంలో ఎక్కువ భాగం ముడివస్తువుల అమ్మకం పైన ఆధారపడి వుంది. వాని ఖరీదు 1/4 కు తగ్గిపోవుటచే ముడివస్తువులను పండించు భారతదేశ ప్రజా సామాన్యం రైతుల స్థితి ఎంతో కృంగిపోయింది.

వారికి వచ్చు ఆదాయం పడిపోయినా వారిచ్చుకోవాలసిన పన్నులు తగ్గలేదు. జమీందారులకు చెల్లించవలసిన మక్తాలు, బకాయి పడిపోయినవి. ఏ యితర దేశాలలోనూ వుండని పెద్ద వడ్డీలకు తెచ్చిన అప్పులు పెరిగిపోయినాయి. ప్రభుత్వం నియమించిన సత్యనాథన్ గారి రిపోర్టులోనే 200 కోట్లు పైగా అప్పు లున్నాయని అంచనా వేసారు. నాటినుండి రైతులు, ప్రచారకులు వ్యవసాయదారుల ఋణపరిష్కారమునకు ఒక శాసనం గావించాలని ఆందోళన చేయుచున్నారు.

కాంగ్రెసు మహాసభ తన వ్యవసాయదారుల కార్యక్రమంలో, మక్తాలు శిస్తులు నూటికి 50 తగ్గించాలని, ఋణ నివారణోపాయాలు గావించాలని తీర్మానించింది. అప్పటి ప్రభుత్వాలుసైతం ప్రజాందోళనవల్ల ఋణ పరిష్కార బిల్లులను ప్రవేశపెట్టి పేరుకు శాసనాలు గావించారు గాని రైతులోకానికి చేకూర్చిన మేలు శూన్యం.

కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలోని రైతు ఋణ బాధానివారణ, శిస్తు మక్తాల తగ్గింపు కార్యక్రమం వల్లనే రైతులోకం కాంగ్రెసు వైపు ఆకర్షింపబడింది. ఎన్నికలలో జయం చేకూర్చింది, జమీందారులకు, బ్రిటీషు సామ్రాజ్యవాదులైనవారికి వ్యతిరేకంగా ఓట్లు నిచ్చింది.

నవుమంతరవు మంత్రివర్గం అనంతరం కాంగ్రెసువారు మంత్రిపదవు లధిష్టించిన నాటనుండి రైతాంగము ఉవ్విళ్ళూరుచున్నది. ఇతర రాష్ట్రాలలో రైతుల బకాయిలకు మారటోరియం, ప్రకటించారు. మద్రాసు రాష్ట్రంలోనూ కొంత ఆలశ్యంగానైనా బిల్లు గజెటులో ప్రకటించారు.

ఇంకేముంది. వెంటనే జమీందారు, వడ్డీ వ్యాపారస్తులు, లాయర్లు గగ్గోలు ప్రారంభించారు. టెలిగ్రాము లిచ్చారు. ప్రజలంతా బిల్లుకు అనుకూలురైనా, అల్పసంఖ్యాకులైన యీ ఉన్నవారు, మంత్రివర్గాన్ని బెదరించగలిగారు. కాంగ్రెస్ మంత్రివర్గం బిల్లును ఎత్తివేసుకొంది. ఇది వెనుకడుగు నెంబరు ఒకటి.

జమీందారులు, వడ్డీ వ్యాపారులు తమ బకాయిలను, అప్పులను రాబట్టుకొనుటకు తీవ్ర ప్రయత్నాలు ప్రారంభించారు. కోర్టుల కెక్కిన కేసులు అసంఖ్యాకము. జప్తులు వేలాలు మితిమీరాయి. రైతులలో ఆందోళన హెచ్చింది. వేలకొలది సభలు జరిపి, తమపై బాకీదారుల పునికొల్పి వదలారని యెలుగెత్తి చాటారు.

ఎట్టకేలకు ప్రజాభిప్రాయం మన్నించి మంత్రివర్గం ఋణ నివారణ బిల్లును తెచ్చారు. ఋణములు అసలు యిచ్చుకొన్న బాకీ రద్దు అన్నారు. అసలుకు రెట్టింపు చెల్లించియుండినచో బాకీ యావత్తు రద్దు అన్నారు. జమీందారీ మక్తా బకాయిలకు 46,47 ఫసలీల రెంటు చెల్లించిన వెనుకటి బకాయీలు రద్దన్నారు. ప్రభుత్వ అప్పులకు, సహకార సంఘ, జాయింటు స్టాకు బ్యాంకు అప్పులకు యీ బిల్లు వర్తించదన్నారు.

రైతు సంఘాలు, యీ బిల్లు తెచ్చినందుకు కృతజ్ఞత తెల్పాయి. వ్యవసాయకూలీలు కూడ యీ బిల్లు వర్తించాలనీ, సహకార సంఘ, బ్యాంకు అప్పులక్కూడా వర్తించాలనీ, జమీందారీ మక్తా బకాయిలు, రద్దు కావడానికి, రెండు సంవత్సరాల చెల్లించాలను షరతు తొలగించాలని సభలద్వారా, డిప్యుటేషన్లద్వారా ప్రభుత్వానికి విన్నవించారు అటు జమీందారులు, వడ్డీ వ్యాపారులు, యీబిల్లు వినాశకరమైనదని బెదరించారు.

సెలక్టు కమిటీలో బిల్లుకు గావించబడిన సవరణలన్నీ రైతుల మేలుకొరకు గాక బాకీదారుల ఒత్తిడికి జంకియే. 1932 సం॥ తరువాత అప్పులకు యీ బిల్లు వర్తించకనియు, నూటికి 6 1/4 వడ్డీ మాత్ర మంగీకరించబడు నన్నారు. 47, 46 ఫసలీ బకాయీలు, 1938,39 సెప్టెంబరు నెల లోపల చెల్లించినచే, వెనుకటి బకాయీలు రద్దు అగునని సవరించారు. అనగా జమీందారులకు రెండు సంవత్సరాల మక్తా గ్యారంటీ చేసారు. పైగా ఇది చెల్లించలేకపోయిన వెనుకటి బకాయి అంతా అలాగే వుంటుంది. ఇది వెనుకడుగు నెంబరు రెండు.

సెలక్టు కమిటీ రిపోర్టు తరువాత ప్రభుత్వం కొన్ని సవరణలు తెచ్చింది. 1932 తరువాత అప్పులకు నూటికి 6 1/4 వడ్డీ నిర్ణయించినా యిదివరకు చెల్లించినధనం పై వడ్డీ చెల్లిపోగా అసలులో జమకట్టబడదనియు, అసలుక్రింద చెల్లించినప్పుడు జమ కట్టబడెనని, మక్తా బకాయీలు, యిదివర కిచ్చిన రెండు యేండ్ల మక్తా గ్యారంటీ చాలక 45 ఫసలీ బకాయికూడ 1940 సెప్టెంబరు లోపల చెల్లించినచే, వెనుకటి బకాయి రద్దు అన్నారు. ఆచరణలో జమీన్ రైతుల బకాయిలు ఏమాత్రం తగ్గవనే చెప్పొచ్చును. ఇది వెనుకడుగు నెంబరు మూడు.

పార్టీ సమావేశంలో శాసనసభ్యులు ఏమైన బిల్లును అభివృద్ధి పరచుటకు ప్రయత్నించారేమో తెలియదు. అసెంబ్లీలో కాంగ్రెసు సభ్యులు, ప్రజలు తమ కేదో చేస్తారని ఆశించుతున్న అసెంబ్లీ సభ్యులు నోరు మెదపుట లేదు. వ్యవసాయ పక్షంనుండి వచ్చే సవరణలు అభివృద్ధి నిరోధకమైనవే గాన, రైతులోకం కోరు సవరణలు తెచ్చేవారు లేనేలేరు. కాంగ్రెస్ సభ్యులు డిల్లులోవలె చేతు లెత్తుటేనా! డిసిప్లిన్ ప్రజలకు మేలు కూర్చు సవరణలు తెచ్చుటకు అడ్డువచ్చుట అన్యాయం.

కాంగ్రెసు శాసనసభ్యులు పార్టీలోను శాసనసభలలోను రైతులంతా కోరుచున్న యీ క్రింది సవరణలు తెచ్చి, రైతుల కృతజ్ఞతను చూరగొనవలసింది. 1. వ్యవసాయకూలీ కూడ వ్యవసాయదారుల నిర్వచనంలో చేర్చుట 2. జమీందారీ బకాయీలకు మూడు సంవత్సరాల మక్తా గ్యారంటీ చేయు, విషమ షరతును తొలగించుట. 3. 1932 సం॥ తరువాత చేసిన అప్పులకు, జమకట్టిన ధనం, 6 1/4 వడ్డీ పోను మిగతా అసలుకు జమకట్టుట

ఇంతమాత్రమైనా చేయక కాంగ్రెసు శాసన సభ్యులు తమకు తగిన కర్తవ్యముకూడా నెరవేర్చలేకపోయారు.

---

రాజకీయ ఖైదీల విడుదలకై ఆందోళన చేయండి

★

నిరశనవ్రతం పూనిన హరేంద్రనాథ మున్షి ఢక్కా సెంట్రలు జైలులో మరణించాడు.

★

మన మద్రాసు రాజకీయ ఖైదీలు 5 గురున్నారు.

★

మనమూ ఖైదీలను విడుదల చేయడానికి ఆందోళన చేయాలి.

★

నిరశన వ్రతాలు పూనకముందే, ఆహుతి కాకముందే, మనం—కాంగ్రెస్ రాజ్యం క్రింద స్వేచ్ఛను కల్గివున్న మనం — ఆందోళన చేయాలి. ఒత్తిడి చేయాలి. విడుదల చేయించాలి.

★

దేశములో నిరశన వ్రతమూనిన ఖైదీలకు మన సానుభూతేగాక విడుదలచేసే ప్రయత్నం కావించాలి.

---



★★★★★★★★★★★★★★★★★★★★★

## ★ వ్యాఖ్యలు ★

★★★★★★★★★★★★★★★★★★★★★

### రాజకీయ ఖైదీలు

క్రిందటిసారి రాజకీయ ఖైదీల నిరశనవ్రతం ప్రారంభించినప్పుడు దేశమంతా ఉడికిపోయింది. నాయకులు ప్రజలు ఆందోళన చేసారు. అప్పుడు గాంధిమహాత్ముడు తదితర మహానాయకులు, వారి విడుదలకొరకై, వారు కోరిన సౌకర్యముల చేకూర్చుటకు సర్వవిధాలా ప్రయత్నించుతామని, వారిని ఉపవాసదీక్ష మానవలసినదిగా కోరారు. వారు నాయకుల కోరికను మన్నించి దీక్షను మానారు.

మూడు నెలలు గడిచాయి. ఆ సమస్య అలాగే వుంది. నాయకులు తగినంత ప్రయత్నం చేసారా? ప్రజలు తమ విధిని నెరవేర్చగలిగారా? అనే ప్రశ్నలకు ధైర్యంగా 'ఔ' నని జవాబు చెప్పగలమా?

బయటవున్న మనం మన కర్తవ్యం నెరవేర్చలేదు. ప్రజల హాహాకారాలు సామ్రాజ్యవాదులకు సైతం "విడుదల చేయక తప్పదు" అను భీతి కలుగునటుల ఒత్తిడి తేలేదు. అంతే కాదు! ఆనాడు వారు మరణశయ్యపై నున్నప్పుడున్న ప్రజాందోళన తర్వాత చల్లారనిచ్చాము. నాయకులు ధీమాగా ముందుకు వారి తీయలేకపోయారు.

నేడు స్వాతంత్ర్యంకొరకు తాము నమ్మిన పంథాలో సర్వం అర్పించుటకు సిద్ధపడిన సోదరులు, మరల జైలులలో ఆనాడు కోరిన హక్కులకొరకే నిరశన దీక్ష ప్రారంభించారు. గాంధిగారి ప్రయత్నాలు ఫలవంతంగా లేదని, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు కాంగ్రెసు అధికారం క్రిందవున్న ప్రభుత్వాలుసైతం తగిన చర్య గైకొన తలచుట లేదని" నిరాశ చేసికొని మరల ఉపవాసం ప్రారంభించారు.

వారు జైళ్ళలో క్రుగ్గుతూవుంటే బయట నున్న మనం చేయవలసిన కర్తవ్యం ఏమిటి? లాహోరు కలకత్తాలలో కాంగ్రెస్ సోషలిష్టు పార్టీలు రాజకీయ ఖైదీల విడుదల చేయాలని ఆందోళన ప్రారంభించినవి. పెద్ద ఊరేగింపులు ప్రభుత్వ మందిరాలకు లేవదీశారు. ప్రభుత్వం 144 ప్రయోగించింది. వారి మొరలు ఆలకించడానికే అవకాశ మివ్వలేదు. పంజాబు శాసనసభలో ప్రభుత్వ సభ్యులు, కాంగ్రెసు మంత్రులు 144 ప్రయోగించారనీ, ఊరేగింపే కాంగ్రెస్ సిద్ధాంతానికి విరుద్ధమని సెలవిచ్చారు. ఇటుల కాంగ్రెసు మంత్రుల పాలన ఉదాహరణగా చూపించుటకు సర్. సికందర్ వంటి వారికి వేలెట్టి చూపుటకు కాంగ్రెసు మంత్రివర్గాలవకాశ మిచ్చినందుల కెంతేని విచారం.

లాహోరు, కలకత్తా సోదరులవలెనే దేశమంతటా సభలు జరపాలి. ప్రజలంతా రాజకీయ ఖైదీల విడుదల కోరుతున్నారని, అందులకేమైనా చేయుటకు సిద్ధంగా వున్నారని రుజువు చేయుటకు పెద్ద డిమాన్‌స్ట్రేషన్లు ద్వారా తెలియజేయాలి. వేయేల! రాజకీయ ఖైదీల విడుదల జరుగువరకు నిద్దుర పోమని ప్రజలంతా ప్రమాణం తమకు తాము చేసికోవాలి.

### దక్షిణాఫ్రికా భారతీయుల విధి

ఇండియా దక్షిణాఫ్రికా యేజెంటు సర్. రజా ఆలీగారిని సాగనంపు విందు సమయంలో మంత్రి హావామఫీర్ "భారతీయులు ఆదిమ నివాసులగు 'బంటు' జాతులతో కలసి యూరోపియనులకు వ్యతిరేకంగా పోరాటం సాగించుతారనే" పదం నిన్నాననియు, అటుల చేయుట ఇండియనులకు హానికరమనియు, యూరోపియన్లతో సామరస్యంగా వుండాలనీ హెచ్చరించారు. జవాబులో రజాఅలీగారు, "విభేదాలకు కారణాలు తొలగించిన యూరోపియన్లతో ఎట్టితగాదా యిండియన్లకు వుండదన్నారు."

కాని ఆఫ్రికాపై ఆదిమజాతులదే నిజమైన హక్కు. యూరోపియన్లు తమకున్న ఆయుధ బలసహాయంతో ఆఫ్రికాను ఆక్రమించి, నెరవు చేసికొని, దేశీయజాతుల అణచివేసి సర్వాధికారాలు తమ హస్తగతం చేసుకొన్నారు. తమవలెనే పొట్ట చేతనిడుకొని వచ్చిన భారతీయులకు ఆస్తిని సంపాదించుకొను హక్కు ఓటింగు నివ్వక అనేక నిర్బంధాలపాలు చేస్తున్నారు. అట్టిచో భారతీయులు ఆదిమజాతులతో కలసి అందరి న్యాయమైన హక్కులను హరించిన యూరోపియనులకు వ్యతిరేకంగా పోరాడుట ధర్మము. తమ కేవో యిస్తారని, దేశీయజాతుల నడచుటకు యూరోపియనులకు తోడ్పడుట తమకూ చేటే! నేడు వారు యూరపియన్ల అధికారం క్రింద అనుభవించే కష్టాలే నిదర్శనం.

### విద్యార్థులు, రాజకీయాలు.

విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనుటను గురించి యీమధ్య వివిధనాయకులు పరస్పర విరుద్ధములైన భావాలను వెల్లడించారు. ప్రధానమంత్రి రాజగోపాలాచారిగారు విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొన రాదన్నారు. వారు లోకల్ బోర్డులకు జారీచేసిన జి. ఓ. లో వెనక రాజకీయోద్యమములో జైలు కెళ్లినవారికి ఉద్యోగము నివ్వరాదను నిషేధము రద్దుపరుస్తూ, ముందుమాత్రం రాజకీయాల్లో పాల్గొనరాదని నిషేధించారు. అంటే పూర్వం రాజకీయాల్లో పాల్గొనుట నేరం కాదని నిర్ణయించి, యిప్పుడు కాంగ్రెసు ప్రభుత్వంక్రింద రాజకీయాల్లో పాల్గొనుట తప్పని నిర్ణయించారన్న మాట. అనగా కాంగ్రెసు సేవకుల స్వాతంత్ర్య పోరాట ప్రచారకులను కాంగ్రెసు ప్రభుత్వం ఏదో ఉద్యోగం ప్రసాదించినంత మాత్రాన వారిని రాజకీయ రంగమునుండి స్వాతంత్ర్య పోరాటంనుండి తొలగించుతూం దన్నమాట.

ఈ విషయంలో బొంబాయి ప్రభుత్వం కొంత అభివృద్ధికరమైన మార్గ మవలంబించినందులకు సంతసం. 16 సంవత్సరములకు మించిన విద్యార్థులు అన్ని బహిరంగసభలకు హాజరుకావచ్చుననియు, 18 యేండ్లు దాటిన విద్యార్థులు, ఉపాధ్యాయులు, దౌర్జన్య భావాలను పురికొల్పు కార్యక్రమం గల్గిన సంస్థలందు తప్ప, అన్ని సంస్థలందు సభ్యులుగా చేరవచ్చునని తీర్మానించింది బొంబాయి ప్రభుత్వం. మద్రాసు ప్రభుత్వం, వారి ననుసరించాలని మేం, కోరుచున్నాం. కాంగ్రెసు ప్రభుత్వానికి పూర్వమే, అనేకమంది స్థానికసంస్థల ఉపాధ్యాయులు కాంగ్రెసు సభ్యులుగా వుండేవారు. ప్రజలు అందులకు యిష్టులగుటచే ప్రభుత్వానికి తెలిసేది కాదు. నేడు కాంగ్రెసు మంత్రులుండగా కాంగ్రెసు వంటి రాజకీయ సంస్థలలో వారు సభ్యులగుటకు హక్కుండుట ధర్మం కాదా? లేక పోవుట మంత్రుల ప్రతిష్టకు భంగకరం కాదా?

మద్రాసు ప్రభుత్వ ఎడ్యుకేషన్ రూల్సులో 8వ అధ్యాయం విద్యార్థులపై అనేక నిర్బంధాలు పెట్టుటకు వీలుగావుంది. దానిని తొలగించాలని విద్యార్థులు చేయుచున్న ఆందోళన గమనించి, ఆ అధ్యాయాన్ని చట్టమునుండి తొలగించుట కాంగ్రెసు మంత్రుల విధి యని మనవి చేయుచున్నాము.

## ★ నేటిప్రపంచం. ★

( 7 వ పేజీ తరువాయి. )

టూనార్ఫరా అనునవి. ప్రభుత్వపక్షం వీటిని జాగ్రత్తగా రక్షిస్తున్నది. విద్రోహులు మాత్రం ఊరుకొనడం లేదు. ఒకసారి 37 విమానాలతో బాంబుల వేసి 300 మందిని చంపారు. టారాగానా రాష్ట్రంలో రాయస్ పట్టణం మీద బాంబులు వేసి 40 మందిని చంపారు. బార్సిలోనాపై బాంబుల కురిపించి 150 మందిని చంపారు. వెలన్సియాపై బాంబుల వేయడం వల్ల 125 మంది చనిపోయారు. బార్సిలోనాపై మళ్ళా విద్రోహులు రెండుసార్లు బాంబుల వేసి 700 మందిని గాయపరచారు. 350 మంది చనిపోయారు. ఇది విద్రోహుల అఘాయిత్యం.

ఇక ప్రభుత్వం కూడ దాడి ప్రారంభించడంలో వెనకబడలేదు. మూరిష్ సైనికు లున్న "క్వెటా" అనే ప్రదేశం మీద 500 పౌన్లు బరువాటి 15 బాంబులను ప్రభుత్వం వేసింది. భయంతో కంపితు లయిపోయారు సైనికులు. అనేకులు మరణించారు. "వాలాడోలిడ్" పై కూడ ప్రభుత్వం బాంబుల వేసింది. ప్రభుత్వం విద్రోహులు బాంబుల వేయడం మానితే తామూ మానుతామని కొన్ని పట్టణాల సూచించింది. టెరూల్ ప్రాంతాల సింగా గ్రామంపైపుకు చొచ్చుకుపోయింది. ఫ్రాంకోను ఇక్కడ మెసలకుండా అరికట్టి కట్టుతున్నది ప్రభుత్వం.

ఈ ప్రభుత్వ విజయానికి, గట్టిగా ఫ్రాంకోను ఎదుర్కొంటానికి కారణం ఏమిటి? కమ్యూనిస్టు సిద్ధాంతాల కోసం ఛాందసంగా ఉండక "పాప్యులర్ ఫ్రంటు" కోసం కృషి చేశారు. ఇలా చేశారని ఫెన్నర్ బ్రాక్వే లాంటివారు, ట్రాట్స్కీ పక్షీయులు కమ్యూనిస్టులను తిట్టారు. ఇలా తిట్టడం, చాలా పొరపాటని. టెరూల్ వద్ద విజయానికీ, కమ్యూనిస్టుల "పాప్యులర్ ఫ్రంట్" నిర్మాణమే కారణమని బ్రెయిల్సుఫర్డ్ కూడ అభిప్రాయపడుతున్నాడు.

ఇలా ప్రభుత్వం ఓడకముందే ఒకవిధంగా బ్రిటన్ ఫ్రాంకోను గుర్తించింది. ఇక నాన్ ఇంటర్వెన్షన్ నాటకం ముగియలేదు. తమ చేత గాదని ఊరుకోక ఏదో నాటకం. నవంబర్ నాల్గవతేదీన కూడింది. మళ్ళా క్రిందటి నెల 26 వ తేదీన సమావేశమయింది. ఇప్పుడు విచారించే సమస్యలు ఉన్న విదేశ వలంటీర్లను సమానంగా వెళ్ళగొట్టడం, ఎవరి రాజ్యం ఎంత వరకు "రికగ్నైజ్" చేయవచ్చునో (ప్రత్యేక పరిస్థితులలో) విచారించడమట. ఇంతకంటే నాన్ ఇంటర్వెన్షన్‌ను రద్దుచేసి ఎవరి ఇష్టం వచ్చిన సహాయం వారిని చేయనిచ్చినా బాగుంటుంది. లేకపోతే పూర్తిగా ఫాసిస్టులను అరికట్టే "మగతనం"చూపినా బాగుంటుంది.

బ్రిటన్ ఫాసిస్టుల వైపుకు మొగ్గుతున్నట్లే అక్కడి పత్రికలు కూడాను. "విద్రోహులు" అని తమను పిలవవలదని, "జాతీయయోధులని" పిలవాలని ఫ్రాంకో గర్జించాడు. కొన్ని ఇంగ్లండు పత్రికలు ఫ్రాంకో విజయాలు చూచి అలాగే మార్చినయి. ఇపుడు ప్రభుత్వ విజయం జూచి, ముందేమవుతుందో అని భయపడి కాబోలు మళ్ళా "విద్రోహులు" అని వ్రాస్తున్నవట! ఇంకా ఎన్ని రంగులు పిరాయిస్తారో ఈ బ్రిటన్ రాజకీయవేత్తలు, పత్రికా సంపాదకులూ ....

### చీనాజపాను యుద్ధం

చైనా విజయపరంపర వార్తలు వస్తున్నయి. మంచిదే. చైనా తమకు రక్షించుకోవడం గాకుండా ఎదురుదాడికూడ సాగించింది. "హూహీసీన్" ను పట్టుకొన్నది. వూహూవద్ద తీవ్రయుద్ధం సాగించింది. నాంకింగ్ పైన ప్రభుత్వమే బాంబులు వేసింది కూడ. ఇలాంటి సమయంలో సైనిక సహాయం కావాలంటూ జపాను సేనాని కోరినా ఫలేదు. పంపవీలు లేదంటూ సమాధానం వచ్చింది.

రష్యా రాయబారి "యం. ఓరల్స్కీ" చైనా విజయాన్ని కాంక్షించుతూ సందేశం పంపాడు. కొద్దో గొప్పో ఆయుధ సామగ్రి రష్యానుంచి వచ్చి పడుతున్నది. జపాన్‌చే కూల్చబడిన ఒక విమానంలో రష్యా పైలట్ ఉన్నాడట. మరి ముగ్గురు రష్యను లున్నారట. అందులో కొన్ని మ్యాప్‌లు, ముఖ్యమగు కాగితా లున్నవట.

ఇలా సహాయం చేస్తున్న రష్యాపై ద్వేషం ఎలా తీర్చుకొనేది. రెండు రష్యారాయబారులకార్యాలయాలని దగ్ధం చేశారు. సోవియట్ రాయబారి ఓరెల్స్కీ చాంగ్‌కింగ్ నుండి, హాంకాకు పోతుంటే, ఇచాంగ్‌వద్ద దిగాలని వచ్చింది. వెంటనే ఆ నగరంపై బాంబుల కురిపించారు.ఎలాగో తప్పించు కొన్నాడు'ఓరెల్స్కీ'.

జపాన్‌తో తక్కిన సామ్రాజ్య వ్యవహారాలు బాగా లేవు. జపాన్ ఒక అఘాయిత్యం చేయడం మళ్లా క్షమార్పణ చెప్పడం మామూలయింది. గిల్లి ఏడ్చే బాపతు జపాను. పానే ఉదంత మయిపోయింది. లేడీబర్డు వ్యవహారం సరిగానే ముగిసింది. మళ్లా ఇపుడు అమెరికన్ విదేశ రాయబారి జె. బి. అల్లిసన్‌ను జపాన్ సైనికుడు చెంపపెట్టు పెట్టాడు. దీనికి అసమ్మతి తెల్పారు అమెరికన్‌లు. మళ్లా క్షమార్పణతో ఈ వ్యవహారం సవ్యంగానే ముగిసింది. ఇలా అసమ్మతులు తెల్పడం అమెరికాకు ఇది మొదటిసారి గాదు. ఈ మధ్యనే నాంకింగులో పదిహేనుసార్లు తమ హద్దు దాటి జపాను సైనికులు తమ భూమిలోనికి వచ్చారని, రక్షణకై వచ్చిన చీనా స్త్రీలను లాక్కుపోయా రని అసమ్మతి తెలియజేశారు. ఇలాంటివి జరగనీయ మని జపాను ప్రత్యుత్తరంతో ఆవిషయం సమసిపోయింది.

ఇలాగే బ్రిటన్, జర్మనీలు తమ భూములలోకి వస్తున్నా రని ఒక త్రాగిన జపాను సైనికుడు పొమ్మంటే పోక, పైగా తిరిగి కొట్టాడని, అసమ్మతి తెలియజేశాయి.

ఫ్రెంచివారు కూడ, హైనాన్ దీవిలోని యూలిన్‌లో బాంబులు వేసినందుకు అసమ్మతి తెలియజేశారు. జపాన్ ఆదీవిలో ప్రవేశించడం తమ అభిప్రాయం కాదని తెలియ జేసింది.

ఇంగ్లండు జపాన్ సంబంధం రోజు కోవిధంగా మారుతున్నది. జపాన్ చక్రవర్తి మాటాడుచూ బ్రిటన్ సహకారం కావాలన్నాడు. హిరోటా గూడపానే, లేడీబర్డు ఉదంతాలకు విచారాన్ని తెలిపాడు. కాని బెదరింపులు మానలేదు. చైనాకు ఆయుధ సామగ్రిని పంపవద్దని, జపాన్‌ను గుర్తించి మెలిగితే తప్ప చైనాలో బ్రిటన్ హక్కుల రక్షణ ఉండదని బెదరించాడు. ఇంతటితో ఆగలేదు. చైనాలోని కొమిన్‌టాంగ్‌తో ఎలాంటి సంబంధం బ్రిటన్ పెట్టుకో రాదని, పెట్టుకుంటే విభేదం రావడానికి అవకాశ మున్నదని బెదరించాడు.

ఇంతే గాదు. పత్రికా, వాక్స్వాతంత్ర్యం అరికట్టా లని జపాన్ ప్రయత్నం. చైనా నోషల్ ఈవినెంగ్ న్యూస్ పేపరు భవనం పైన బాంబు వేశారు. కోడ్ భాష ఉపయోగించరా దని వార్తల సెన్సార్ చేయడం ప్రారంభించారు. ఇంగ్లండు అమెరికాల అనమ్మతితో ఈ విషయంలో కొంచెం మళ్లా మెత్తగిల్లారు.

ఇక ప్రపంచ సానుభూతి మాత్రంచైనాకు దినదినమూ వృద్ధి అవుతున్నది. అని దేశాలలో జపాను వస్తుబహిష్కారం సాగింది. బ్రిటన్‌లో ప్రధాన మంత్రి వద్దకు కార్మిక సభ్యులు రాయబారం వెళ్ళి జపానుకు ఆయుధాలు పంపవల దని, శాంక్షన్లు అనులుపరచ మని, కోరారు. అమెరికా చైనాకు 5 మిలియన్ల డాలర్ల సహాయం చేయవలసిందని న్యూయార్కు సభ్యుడు, ప్రొన్సిస్ గల్కీగా తీర్మానం తెచ్చాడు. మన దేశంలో, బొంబాయి మేయరు 30 వేల రూపాయల పంపాడు. అన్నిటికంటె ముఖ్య విషయం, జపాను ఆయుధాల కుపయోగపడు నని, ఫ్రెంచి కార్మికులు ఒక జపాను నౌకలో సామాను వేయ నిరాకరించారు. అయితే ఈ సహాయం తగినంత కాదు. ఇంతకంటె ఎక్కువ ధనసహాయం, ఫ్రెంచి కార్మికుల లాగ సమ్మెలు, జపాన్ వస్తు బహిష్కరణం తీవ్రమైతే జపాన్ ఎక్కువింటుంది. ఇప్పటికే ఎన్నో రెట్లు పన్నులు వృద్ధి అయినయి. ఇక అణచి వేయబడిన జపాను కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు ఒక మహా విప్లవాన్ని తీసుకొని వచ్చే అవసు రావాలంటే, జపాన్ ఆర్థికంగా దెబ్బ తినాలి....

ఈ యుద్ధంలో యువతులు సైతం ఎంతో తీవ్రంగా ప్రతిఘటన చేస్తున్నారు. హులాన్ హిసేనా అనే ఆమె నాయకత్వం క్రింద సైనికుల వెంబడే చైనా యువతుల దళాలు బయలుదేరినయి. వీరు ప్రజలకు ఎందుకు యుద్ధం చేస్తున్నారో తెలుపుతారు. కార్మిక స్త్రీలను సైనికులగా తయారు చేస్తారు. ఆహారపదార్థాల సప్లయి చేస్తారు. ఇలా చైనా ప్రజలు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. చైనాయొక్క ఈ విజయ పరంపరలకు కారణాలు ఏమిటి? ఒక్క రష్యా ఆయుధ సహాయం వల్లనే ఈ విజయం సంభవించడం లేదు. మిలటరీ ఎత్తుగడలు మారినయి. దీనికి కారణం కమ్యూనిస్టులతో యునైటెడ్ ఫ్రాంటు సంభవించడం. జాతిమైక్య సంఘటనం ఏర్పడిన తర్వాత ఈ మార్పులు జరిగాయి. (1) జంగ్-కై-షెక్ ఆధిపత్యం క్రింద, దిట్టమైన మిలటరీ కౌన్సిలు ఏర్పడటం. ఇందులో నా-సి-యంగ్, చూ-తే, హూయీ అనే ముగ్గురు కమ్యూనిస్టు నాయకులు ఉండటం.

(2) యుద్ధ పరికరాలను ప్రభుత్వ సంఘటన చేసి నిష్పంధ మిలటరీ ట్రైనింగు ఏర్పరచడం.

(3) జపాను వారి, దేశ ద్రోహుల ఆస్తిని లాగి కొనడం.

(4) కమ్యూనిస్టుల ఒత్తిడి వల్ల గోరిల్లా యుద్ధాలు సాగించడం.

ఇంతేగాక కమ్యూనిస్టుల గోరిల్లా పద్ధతులు చైనాకు లాభం కలుగ చేస్తున్నాయి. మూడు దళాలు కమ్యూనిష్టు పార్టీవి ఉన్నవి. ఇవి వూకిన్, అన్హ్వేరాష్ట్రాలలో యుద్ధం చేస్తున్నాయి. కొన్నిచోట్ల జపానును తరుమగొట్టినయి. కమ్యూనిస్టు నాయకులు ఇలా ప్రకటించారు. "తాత్కాలికంగా ఓడినా అంతిమ విజయం మాదే. ప్రతి అపజయం మా బలహీనత ఎక్కడ ఉన్నదో తెల్పింది. ఒక రోజు మేం పోరాడిన కొలదీ వారలని పోతారు. వారు లోపలకు చొచ్చిన కొలదీ వారికి సైన్యం తగ్గుతుంది. చైనా విజయం కోసం మాశక్తి కొలదీ ప్రజల ఐకమత్యం కొరకు రాజకీయి చైతన్యం కొరకు యత్నించుతున్నాం. మా విజయం నిశ్చయం." మనం కూడ తథాస్తు అని అందాం....





## వీరుల పాడు.

### స్థానిక కాంగ్రెసు సోషలిస్టు పార్టీప్రథమ సమావేశం.

ఈ వూరిలో కాం. సోషలిస్టు పార్టీలో మొత్తము 35 మంది మెంబర్లు వున్నారు. వారిలో 3 స్త్రీలు కూడ వున్నారు. 2—1—38 రాత్రి 8 గంటలకు కామ్రేడ్ జొన్నగడ్డ రామలింగయ్య(ఆం. రా. కాం. సోషలిస్టుపార్టీ సహాయ కార్యదర్శి)గారి అధ్యక్షత క్రింద వీరులపాడు కాం. సోషలిస్టుపార్టీ ప్రథమ సమావేశము జరిగెను.

కామ్రేడ్ వాసిరెడ్డినారాయణరావు (సెక్రటరీ) గను, మరి నల్గురు కార్యనిర్వాహక సభ్యులుగను ఎన్నుకొనబడిరి.

## కర్నూల్ జిల్లారైతుసంఘము

జిల్లా రైతు నేతలుందరు జనవరి 19 తేదీన కంభంలో రంగాగారి అధ్యక్షత క్రింద సమావేశమై యీ క్రింది తాత్కాలిక కార్యనిర్వాహకవర్గము నెన్నుకొనిరి.

శ్రీయుత నూరా రామిరెడ్డిగారు ప్రెసిడెంటు.
,, చేగిరెడ్డి బాలిరెడ్డి ,, జెనరల్ కార్యదర్శి
,, దుర్వాల చెంచిరెడ్డి ,, సహాయ కార్యదర్శి
,, ముదియం నరిసిరెడ్డి ,, ట్రెజరర్

మరి 11 గురు కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకొనిరి.

### తీర్మానములు

ప్రతి సభ్యుడును, జిల్లాయంతట రైతు సంఘసభ్యుల, విరివిగా చేర్పించ వలెననియు, జిల్లా కార్యాలయము, గిద్దలూరులో స్థాపించుటకు తీర్మానించిరి.

ఉత్తర ప్రత్యుత్తరా లీదిగువ అడ్రెసుకు పంపకోరుతాను.

కార్యదర్శి
జిల్లారైతుసంఘము
రాయలసీమ బిల్డింగు
గిద్దలూరు.

## పొన్నూరు విద్యార్థిసంఘం

7-1-38 స్కూలుఫైనలు విద్యార్థులందరు సంతకములుచేసి సెలెక్షను పరీక్ష ఫలితములు తెలియపర్చవలసినదిగా మహాజరును హెడ్‌మాస్టరుగారికి సమర్పించిరి. ఆయన కోపముతో దానిని చించివైచి పి. శ్రీరాములను విద్యార్థిని అవమానించి డిస్మిస్ చేయుదుమని బెదరించెను. స్టూడెంట్సు వర్కింగు కమిటీ సమావేశమై హెడ్‌మాస్టరుగారు చేసినపనికి పొరపాటును నట్లును, డిస్మిస్ చేయుదు వను బెదరింపు ఉపసంహరించు కొనునటల్లును లేనియెడల స్కూలుఫైనలువారు స్ట్రైక్ చేయునట్లును తీర్మానించిరి. 10-1-38 తేదీ హెడ్‌మాస్టరుగారికి పొరపాటన వలయుననియు, డిస్మిస్ అనుమాట ఉపసంహరించుకొనవలయుననియు పిటీషను నివ్వ. ఆయన తీసుకొనలేదు. అంతట స్కూల్ ఫైనలువిద్యార్థులుస్ట్రైక్ చేసిరి. సాయంత్రము స్కూలంతయు స్ట్రైక్‌లోగలసెను. 16-1-38 సాయంత్రము హెడ్‌మాస్టరుగారు విద్యార్థిసంఘ ప్రెసిడెంటు గారికి స్ట్రైక్ విషయమును మాటలాడుటకు ఆహ్వానమంపిరి. రాజీ కుదురలేదు. 17-1-38 మధ్యాహ్నం జంగోలు, జిల్లాబోర్డు ప్రెసిడెంటుగు కాసుబ్రహ్మానంద రెడ్డిగారు వచ్చిరి. విద్యార్థి సంఘ ప్రెసిడెంటుకు ఆహ్వానమంపిరి. కా॥ మునిపల్లె రామారావు, తూములూరి సత్యనారాయణ, మొదలగువారు, కల్యకేషనుగాదెళ్ళ విద్యార్థుల హక్కుల మాట్లాడిరి. శ్రీ॥ బ్రహ్మానందరెడ్డిగారు హెడ్మాష్టరుగారిచే స్కూలు ఫైనలుపరీక్ష కందరిని పంపినట్లు సర్టిఫికేటు నడేసి, ఇతర హక్కుల శ్వేతలో సెటిల్చేత్తమని వాగ్దాన మొసంగిరి.

పి శ్రీరాములు
సెక్రటరీ.
ఎయ్యిద్ద బోర్డుహైస్కూలు విద్యార్థి సంఘము.
పొన్నూరు.

## కంభంతాలూకాయువజన సంఘం గిద్దలూరు

కంభంతాలూకా యువజనసంఘము ఎన్నికలు జరిగినవి. జిల్లాయువజనసంఘపు ఆర్గనైజరు కామ్రేడ్ పటం రంగారెడ్డి గారధ్యక్షత వహించిరి.

శ్రీయుత బెల్లంకొండ రామన్నగారు అధ్యక్షులుగను చేగిరెడ్డి బాలిరెడ్డి, పి. కోటయ్యనాయుడు గారు కార్యదర్శులగను ఎన్నుకొనబడిరి.

## కంభంతాలూకా ప్రథమ రజకజన మహాసభ

ఫిబ్రవరి 5 తేదీన తుమ్మెళ్లలో జరుగును

అధ్యక్షులు:—కామ్రేడు చేగిరెడ్డి బాలిరెడ్డిగారు

సోదరులారా?

మన రజకుల స్థితి నానాటికి క్షీణించుచున్నది. రాజకీయంగా, ఆర్థికంగా నైతికంగా, అన్నివిధాలా అధోగతి పాలౌతున్నారు. మన కనీసపు కోర్కెల ప్రభుత్వానికి విన్నవించుకోటానికి మహాసభ అత్యవసరము. అందరూ యిదియే ఆహ్వానముగా గైకొని సభ విచ్చేయ పార్థితులు. కామ్రేడ్ రంగారెడ్డిగారు జాతీయపతాకాన్ని యెగురవేయుదురు.

ఇట్లు
గొలవరం 23-1-38 } డాక్టరు బొజ్జారంగయ్య
ఆహ్వానసంఘాధ్యక్షులు

## బహిరంగసభ

సంక్రాంతి పండుగకు అనేక గ్రామాల్నుండి, కూలీలు చిన్న, చిన్న, రైతులు కోళ్ళపందేలు వేసేమిత్తం షుమారు పదివేల ప్రజలు సమావేశమయారు.

చదలవాడ పిచ్చయ్యచౌదరిగారు, పులివర్తి పాలువేజండ్ల, వెంకటరత్నంచౌదరిగారు, మరికొందరు కలసి ఎర్రజండా బట్టుకొని, కూలోడ! అనే పాట పాడుతూ, గం 2 1/2 లకు ఒకచో సమావేశం చదలవాడ, పిచ్చయ్యచౌదరిగారి అధ్యక్షతక్రింద జరిగించి..

షుమారు సభకు ఐదువందలమంది ప్రజలు వచ్చారు సభలో పులివర్తి పాలు కార్మిక కర్షకసంఘాల ఆవశ్యకతను గురించి, ఉపన్యసింప అధ్యక్షులు కూలీలు కూలిసంఘాల్లో, విరివిగాచేరి, ప్రస్తుతమున్న కనీసపు కోర్కెల్ని, నెరవేర్చుకోనేందుకు, సంఘాల్ని, అభివృద్ధిపరచవలసిందని పేదరైతులు రైతుసంఘాల్లో, విరివిగాచేరి వారి కనీసపుకోర్కెల్ని, నెరవేర్చుకోనేందుకు ప్రయత్నించు కోండని, ప్రపంచంలోని కష్టజీవులకు ముఖ్యచిహ్నమైన ఈఎర్రజండా క్రింద మన పోరాటం సాగి, మనకోర్కెలన్నీ, నెరవేరుతాయని చెప్పారు, ప్రపంచకార్మిక కర్షకసంఘాలు వర్ధిల్లు! ప్రపంచంలోని కష్టజీవులంత ఏకం కండి! విప్లవంవర్ధిల్లు! అను నినాదాల్తోసభను విసర్జించారు.

వల్లెవాడ 14 1-38
ఇట్లు
పులివర్తి పాలు

## నర్సాపురం తాలూకా కాంగ్రెసు సంఘ తీర్మానాలు

1. కూలీలు, మొదలగు బీద జనులందరు విశేషముగా కాంగ్రెసులో చేరి కాంగ్రెసును బలపర్చుటకుగాను, కాంగ్రెసు సభ్యత్వపు చందా 0—4—0 నుండి 0—1—0 కు మార్చవలసినదిగా ఈ సభవారు అ. భా. కాం. సంఘమువారిని కోరుచున్నారు.

2. లాహోరు సెంట్రల్ జైలులో నిరశన వ్రతము వల్ల కృశించుచున్న ఖైదీలను వెంటనే ఎట్టి షరతులు లేకుండా విడుదల చేయుటకుగాను తగిన కృషిచేయవలసినదిగా రాష్ట్రీయ ప్రభుత్వములను, కాంగ్రెసు మహాసభవారిని కోరుచు. తీర్మానించుచున్నారు

3. యీ తాలూకా గల వ్యవసాయమునకు అనుకూలముగా నున్న బంజరు భూములను వ్యవసాయ కూలీలకు పేదరైతులకు, నిరుద్యోగులకు యెట్టి నజరా లేకుండా ఉచితముగా ఇవ్వవలెనని మదరాసు కాంగ్రెసు మంత్రివర్గమును ఈ సభవారు కోరుచున్నారు

4. అగర్రు గ్రామములోని లోకల్‌ఫండు కాల్వగట్లపైన కొబ్బెరచెట్లను పాడుకొనుటకు సాలు 1కి చెట్టు 1కి. 0-4-0 మాత్రమే రేట్లపైన గోరింటాడ కాపరస్తులకు ఒక రిద్దరికి పర్మిషను ఇచ్చుచూ నర్సాపురం జిల్లా బోర్డువారు గావించిన నెం 875-876 తీర్మానములను ఈ సభవారు పూర్తిగా ఖండించుచు అగర్రు గ్రామమునకును, అందలి ప్రజలకును, కలుగు నష్టము అనారోగ్యము, లక్ష్యముంచుకొనక జిల్లాబోర్డువారు కేవలము పాక్షిక బుద్ధితో గావించిన సదరు తీర్మానములనువెంటనే రద్దుచేయించుటకుగాను జిల్లా కలెక్టరుగారున్ను స్థానిక ప్రభుత్వము వారును అవసరమైన చర్యను తీసుకొనవలసినదిగాకోరడమైనది.

ఇట్లు
ఉద్దంరాజు సూర్యరాజు,
ప్ర. కార్యదర్శి, పాలకొల్లు.

# చింతలపూడి తాలూకా రైతు యాత్ర

(ఒక ప్రేక్షకుడు)

అనాడు 25 తేదీ మంగళవారం. రాష్ట్రరైతు సంఘమువారి గడువు 24 తేదీతో యాత్రలు ముగించమన్నారు. కాని మా చింతలపూడి తాలూకా మాత్రం 25 తేదీన జరిపింది. కారణము మా తాలూకా అధికారి తహశ్శిల్‌దారుగారు 24 తేదీన లేని కారణాన. 25 మంగళవారంనాడు వచ్చిన సిద్ధముగ నుందునని ముందుగ రైతు పెత్తందార్లకు తెలుపుటవల్ల 25 తేదీన యాత్ర సాగింపబడెను. సోమవారం రాత్రే యాత్రకు కావలసిన, సన్నాహా లన్నీపూర్తి చేసుకోడానికి తాలూకా రైతు పెత్తందారు, నిరంతర ప్రచారకుడు, అగు చిలుకూరి రెడ్డి చింతలపూడి వచ్చి యువజన సంఘ పెత్తందార్ల పూర్తి సహాయంతో పని మొదలిడినాడు. రాత్రంతా నిద్రలేకుండా పని సాగించారు. తెల్లవారింది నలు మూలలనుండి తలపాగాలవారు. చేతి కర్రలవారు. పంచలు పైకి కట్టినవారు చొక్కాలు లేనివారు. బక్కకడుపులవారు. ముఠాముఠాలుగా రావడం చూస్తే వాళ్ల దరిద్రం నాటితో తొలగిపోతుందనే ఆశ ఆ పేదరైతుల ముఖాలలో కనుపించింది. సరిగా తొమ్మిది గంట లయ్యేసరికి ఏలూరునుంచి జిల్లా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి గారపాటి సత్యనారాయణ. రంభా వెంకటప్పయ్య. పేరేటి వెంకటరత్నం. కె. రాములు యాత్రను సాగించడానికి వచ్చారు. రైతులు వారి కష్టాలను గురించి. జమీందార్లు మొఖాసాదార్ల వల్ల తా మనుభవించుచున్న బాధలను గురించి అర్జీలు వ్రాసి పెట్టాలని కోరే సరికి ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క అర్జీ తయారుచేసి పెట్టారు. యింతలో జిల్లా జమీన్‌రైతు సంఘాధ్యక్షులు నెక్కలపు వీరయ్యగారు వచ్చారు. వారు తాలూకా మొత్తానికి కావలసిన విషయాలను వ్రాసి చదివి వినిపించారు. పిమ్మట జిల్లా కాంగ్రెసు సంఘకార్యదర్శి గారపాటి సత్యనారాయణగారు రాష్ట్రం మొత్తంమీద రైతులు యిస్తూవున్న మెమోరాండమును చదివి వినిపించి యాత్రలో రైతు ఎట్లు ప్రవర్తించవలసినదీ. విపులంగా చెప్పారు.

### యాత్ర

మూడు వేలనుంది రైతులు పన్నెండు గంటలవేళ బారులుతీరి యాత్రను సాగించుచుండ "జమీందారీ పద్ధతి" అనే సరికి "నాశనమో" అనే కేక ఒక్కసారిగా మూడు వేలమంది రైతులు ఐక్యకంఠమున పలికేసరికి చింతలపూడి తాలూకా యావత్తు దద్దరిల్లినదా? జమీందారీ పద్ధతి యిక యీ తాలూకాలో వుండుటకు ఆస్కారము లేదా? అనే సందేహం ప్రతివానికి కలిగిందనే చెప్పాలి. చింతలపూడి తాలూకాలో యిదివరకెన్నడు యిట్టి దృశ్యము చూచినవారు లేరు. 5 వర్లాంగున్న ఆ రైతుదండును చూచినప్పుడు. "మా కొద్దీ జమీందార్ల పొందు" అనే పదాన్ని పాడుతూన్నప్పుడు. ఆదండుకు ముందునాయకత్వం వహించి నడుస్తూవున్నవా? ఆశా జ్యోతి యగు ఎర్ర జండాకు చేతులు జోడించి జే జేలు కొట్టుమన్నప్పుడు. జమీందారీల. మొఖాసా దారుల అమానుష చర్యలు నాశనమో అని కేక లిడునప్పుడు. పాటలు చెప్పుతూ దండును నడుపుతూవున్నా సేవకుల ముఖాలు చూస్తూ వున్నప్పుడు. ఆదండులో ఎట్టి అపూర్వ శక్తి ఎట్టి భావాలు గలవో....

ఊరేగింపు సరిగా గం 2 లయ్యేసరికి తాలూకా ఆఫీసుకు చేరుకుంది. మూడు వేలమంది కేకలు ఒక్కపెట్టున వినిపించే సరికి తాలూకా ఆఫీసులో పని చేసుకుంటున్న వారంతా స్తంభించి పనులు కట్టిపెట్టినారు. యింతలో తహశ్శిలుదారు జేమ్సుగారు వచ్చి దండును గౌరవ మర్యాదలతో ఎదుర్కొని కూర్చుండమని చెప్పిరి. కూర్చొనుటకా స్థలము లేదు. మూడు వేల మందికి ఎచ్చటి సరిపోవును? యింతలో తహశ్శిల్‌దారుగారు వరండాలోకి వచ్చి బయటనే రైతుల కోర్కెలు వినుటకు నిశ్చయించిరి. ఎంతకూ అంతు లేని రైతు దండును చూచి తహశ్శిల్‌దారుగారు నిర్ఘాంతపోయిరి.

రాయబారమును నడుపుచున్న పెత్తందార్లు తాలూకా రైతుసంఘాధ్యక్షులు బర్మా పాపారావు, కార్యదర్శి నాగభూషణం, జిల్లా జమీన్‌రైతు సంఘాధ్యక్షులు నెక్కలపు వీరయ్య, జిల్లాకాంగ్రెసు సంఘ కార్యదర్శి గారపాటి సత్యనారాయణ, తాలూకాలో నిరంతరం పని చేయుచున్న రైతు సేవకుడు చిలుకూరి వెంకటప్పారెడ్డి చింతలపూడి నివాసులు పులిపాటి శ్రీరాములు, జల్లిపల్లి పుల్లయ్య, వెంకట్రామయ్యగార్లు తహశ్శిల్‌దారుగారి చెంత కూర్చొని సాగించిన రాయబారమును తహశ్శిల్‌దారుగారు శాంతముగా వినిరి. పాపారావుగారు మెమోరాండమును చదివి వినిపించిరి. అంతట గారపాటి సత్యనారాయణగారు యాత్రయొక్క ఉద్దేశ్యాన్ని గురించి తహశ్శిల్‌దారువారికి తెలియపర్చి నేటి యాత్రకు వచ్చిన రైతులు దాఖలు చేసుకొను అర్జీలను గురించి చెప్పి ఒక్కొక్క అర్జీని గురించి, రైతులు జమీందార్ల, మొఖాసాదార్లవల్ల పడుతున్న యిబ్బందులను గురించి చెప్పిరి. మొత్తం 55 గ్రామాలనుంచి రైతులు స్వయంగా వచ్చి దాఖలుచేసుకుంటున్న అర్జీలు చూచి తహశ్శిల్‌దారుగారు ఆశ్చర్యపోయిరి. యాత్రలో రైతులు తీసుకవచ్చిన ఆ నినాదాలు గల బోర్డులపై వ్రాసిన

"జమీందారీ పద్ధతి నశించాలి"

"ఎక్కువ వడ్డీలు తగ్గాలి"

"ఋణపరిష్కార చట్టం రైతుల కనుకూలంగా నుండునట్లు మార్చాలి"

"మొఖాసాదారు పద్ధతి పోవాలి"

"పెట్టుబడి విధానం నశించాలి"

"జమీందారీ గ్రామాలలోని చెర్వులు మరమ్మతు చేయించాలి"

'రైతు సంఘాలు వర్ధిల్లాలి'

వగైరా వాక్యాలు చూచి నివ్వెరపోయినారు మొత్తంమీద రైతుల రాయబార మంతయు విని తాను చేయుటకు వీలున్నవన్నియు చేయుదుననియు, మిగతా విషయాలు, జమీందార్ల దౌర్జన్యాన్ని గురించి గవర్నమెంటువారికి తెలుపుదుననియు. రైతులు కూలీలు ఏకముగా నుండిన మీ కష్టాలు పోవుననియు, రైతు లందరను హెచ్చరించిరి. తహశ్శిల్‌దారువార్కి వందనాలు తెలిపినపిమ్మట రైతు సంఘాలకు జై అనే కేకలలో రాయబారమును ముగించిరి.

పిమ్మట రైతులందరు రాదారి బంగాళావద్ద బ్రహ్మాండమగు సభ జరిపిరి. అందు రంభా వెంకటప్పయ్య, నెక్కలపు వీరయ్యగార్లు జమీందార్ల దుండగాలను గురించి పాటలు పాడిరి. పిమ్మట గారపాటి సత్యనారాయణగారు రైతులందరు ఏకముగా నుండి సంఘాలు ఏర్పరచుకో వలసినదనియు, జమీందార్లతో పోరాటమును సాగించుతూవున్నపుడు మనం చాల యిక్కట్టులకు లోను కావలసి వచ్చు ననియు,బాధలు వచ్చి సమాయమొక్కని ఈ జమీందారీ, మొఖాసాదార్ల దుండగాలను మాపు మాపాలని చెప్పుతూంటే రైతులందరు"జమీందారీ పద్ధతి నాశనమో" ఎన్నికష్టాలకైనా సిద్ధం" అని ఒక్క పెట్టున ఐక్యకంఠముతో పలికేసరికి నిజంగా జమీందారీ పద్ధతి చాల కొలది కాలంలోనే మీరందరు యీ విధంగానే, కట్టుగా వుంటే నశించుతుందని చెప్పిరి. అంతట యాత్రను గురించి, తహశ్శిల్‌దారుగారు చెప్పిన జవాబుగురించి, రైతులందరకు చెప్పిన పిమ్మట సభ ముగింపబడెను, ముత్యాల రావుగారి అభివందనాలతో సభ ముగింపబడెను.

# స్పెయిన్ ప్రభుత్వ విజయం తథ్యము

స్పైయిన్‌లో పర్యటనం సల్పి వచ్చిన బ్రిటిష్ కమ్యూనిష్టు హారీపాలిట్ "స్పానిష్ యుద్ధం అంతరించే సూచన లున్నాయని" పల్కాడు.

గ్లాస్గోలో ఉపన్యసిస్తూ అత డిలా అన్నాడు. "స్పైయిన్ ప్రజల ఆత్మవిశ్వాసంను జయించడానికి ఎవరికీ తరం గాదు. టెరూల్ నగర విజయం తర్వాత, సారగోసా, మాడ్రిడ్‌లోని యూనివర్శిటీ సిటీని ప్రభుత్వం జయించుతుంది. కొన్ని నెలలలోనే ప్రతి ఫేసిస్టును స్పైన్‌నుంచి తరిమివేస్తారు."

టెరూల్‌నగరంలో తన అనుభవాలను గురించి చెప్తుతూ "పాలిట్" ఇలా చెప్పాడు.

"బాంబుల వర్షింపుతూ ఉంటే, నా ముఖం మంచులో దూర్చి పడుకొన్నాను. నావంతు కూడా వచ్చింది అనుకొన్నాను. కాని స్పైన్ ప్రజలు రోజూ పడే అవస్థలే ఇవి."





# ★జమీందారీ విధ…

## ఆంధ్రజమీన్ రై…

[ గతసంచిక…

### కోర్టులు

రివిన్యూ, సివిలుకోర్టుల పెత్తనం న్యాయహేతువున్నూ జమీందార్లకు ప్రత్యేక లాభకారి బలకారి గనుక దాన్ని పూర్తిగా రైతుసంఘాల ప్రతినిధులతో కూడిన జడ్జీ అధ్యక్షత క్రింద సమావేశం అయ్యే ల్యాండు కోర్టులకు ఫీజు లేకుండా ట్రాన్స్‌ఫర్ చేయవలెను.

### జమాబంది

ప్రతిసంవత్సరము గవర్నమెంటు యిలాకాలలో జరిగే విధిగా అధమం రివిన్యూ డివిజనలు ఆఫీసరుచేత జమాబందీ చేయించవలెను.

### సాగుబడికి లాయకీయైన బంజర్లు

సాగుబడికి లాయకై సాగుచేయబడక, గ్రామ సముదాయ వుపయోగానికి అవసరంకాని బంజరులను భూమిలేని వ్యవసాయకూలీల సహకార సంఘములకు అమ్మకునే హక్కు లేకుండా యిచ్చుటకు అట్టి సంఘములమీద వీటిసంబంధించినంతవరకు యాజమానము పంచాయితీల క్రింద ఉండవలెను.

### నీటి తీరువ రేటు

పక్కనున్న ప్రభుత్వపు మాగాణి నీటితీర్వారేట్లకు హెచ్చుగా నున్న జమీందారీ నీటి తీర్వా రేట్లను మాత్రముతప్పక గవర్నమెంటు రేట్లవరకు తగ్గించవలెను.

### స్వంత కమతములు

1936 శాసనం వర్తించే ల్యాండు హోల్డరుకున్నూ స్వంతకమతము ఉండరాదు.

### సైర్లవారీ ధాన్యపు శిస్తులు

ఎలాంటి పరిస్థితులలోగాని ఎచ్చటగాని ధాన్యపు శిస్తులు లేక సైర్లవారీ శిస్తులు ఉండరాదు.

### యేజంటు ప్రతినిధి

జమీందారుకు, రైతుకు మధ్యజరిగే వివాదములలో రైతుల పక్షాన కోర్టులలో వాదించుటకు, వ్యవహరించుటకు జమీందారునకు వలెనే రైతులకు గూడ తమ సంఘముచే నియమింపబడ్డ యేజంటునకు అధికారముండవలెను.

### లంకలు శిస్తులు

యిప్పటి వేలంపాట శిస్తులను వేయుట మాని లంక భూములమీద తదితర ప్రభుత్వపు మెరక భూముల మీద వేయబడే శిస్తుల మాత్రమే వేయవలెను.

### రివర్ కనసర్ వెన్సీ

నదీగర్భములోగల రైతుభూములలో బావులు త్రవ్వుట తోటలు వేయుట వగైరా వ్యవసాయక అవసరపుపనులు చేయుటకు, అనుమతియిచ్చుటకు కన్‌సెర్వెన్సీ డిపార్టుమెంటువార్కి యిప్పుడువున్న అధికారము చెలాయించుటకు గ్రామపంచాయితీల సలహాను విధిగా పొందునట్లు చేయవలెను.

### యీనాందారీ రైతులు

(a) ఆంధ్రరాష్ట్ర యీనాం రైతుసంఘం వారు ఈదివరకే నివేదించిన ప్రణాళికను అమలుపరచవలెను.

(b) ప్రత్యేకంగా వారు సూచించున ట్లు 1936 శాసనంప్రకారం యీనాందారీ రైతులకు దక్కవలసిన శాశ్వత జరాయితీ హక్కును భంగపరచుచున్న యీనాందారీప్రయత్నములను అరికట్టి క్రిందటి పండ్రెండు సంవత్సరములలో ఎప్పుడైనమూ తన జరాయితీలో యేయీనాంభూమియైనా వుండెనని చూపెట్టుటకు గాను మక్తా లేక శిస్తువసూలునకో చేసిన దావామక్తా చెల్లుబడిపై వ్రాయబడిన యేప్రాంసరీనోటు తదితర వ్రాతమూలకపు దాఖలా వగైరాలు దొరికినచో,

…భూమినే రైతుజీవనోపాధికి అవసరమగు కనీసపు మొత్తపు విస్తీర్ణము మినహాయించి జప్తు చేయవచ్చును. శిస్తుల బకాయిల కొరకై యేరైతును అరెస్టు చేయరాదు.

### శిస్తు వసూలు చేయు అధికారము

యావత్తు జమీందారీ శిస్తుల వసూళ్ళ పెత్తనం జమీందారులనుండి తొలగించి గ్రామ పంచాయితీలకు గాని లేక ప్రభుత్వమే రివిన్యూ డిపార్టుమెంటునకు గాని నొప్పగించవలెను.

### సాముదాయక భూములు

చెరువులు పుంతలు దాగులు వంకలు దొరువులు డొంకలు మందబయళ్ళు శ్మశానాలు కాలువకట్టులు దొరువులు వానికట్టలు గర్భాలు వగైరాలు యావత్తు సాముదాయక భూములమీద పెత్తనం గ్రామపంచాయితీలకు చెందవలయును.

### గ్రామాధికారులు

గ్రామాధికారులు సరాసరి ప్రభుత్వ యాజమాన్యము క్రిందనే వుండవలెను కాని యే మాత్రం సంబంధము బట్లుగాగాని ప్రవేటుగాగాని జమీందారులతో వుండనివ్వరాదు; గ్రామాల రికార్డులు యావత్తూ సైత్వారీ యిలాకాలలో వలెనే తయారు చేయించ బడవలయును;

# స్పానిష్‌దేశ ప్రాచీన చరిత్ర

( 4 వ పేజీ తరువాయి. )

బడ్డారు. ఈవిధంగా కాథలిక్‌రాజుల. చర్చియొక్క నిరంకుశత్వమునకు (Abs olutism) ప్రజాసామాన్యపక్షాలకు పోరాటం స్పెయిన్‌లో మామూలు అయిపోయింది. అనేక పోరాటములు వచ్చినయి. ఈపోరాటాలలో, చర్చిఅధికారం వెనుకబెట్టుకొని, సైన్యం, నావికాదళం ప్రజాసామాన్యానికి వ్యతిరేకరంగాను, ఎప్పటి కప్పుడు నిరంకుశంగాను ప్రవర్తించారు. అయినప్పటికి ప్రజలు తమ సామాన్య హక్కులు సంపాదించుట కొరకు, ప్రజాస్వామిక వాదాల్ని బలపరుచుకొంటూ, ఎప్పుడూ పోరాటం చేస్తూనే ఉన్నారు. 1854 పార్లమెంటులో, ప్రజాస్వామిక వాదాల్ని స్పష్టంగా చాటించారు. పార్లమెంటు యొక్క బలం రోజురోజుకూ అభివృద్ధి అగును. రాచరికం, కాథలిక్ చర్చిఅంటే అందరికి అసహ్యం, అసంతృప్తి పెరిగిపోతున్నాయి.

ఈ పరిస్థితులలో స్పెయిన్ దేశంలో, ఒక క్రొత్త రాజకీయ సిద్ధాంతము ప్రవేశపెట్ట బడెను—అది అరాజకవాదం ( Anarchism ). యూరపుఖండంలో, ఒక స్పెయిన్ దేశంలోనే, ఈసిద్ధాంతం పాతుకుపోయింది, చర్చి, రాచరికముయొక్క నిరంకుశత్వమువల్ల కల్గిన అసంతృప్తియే దీనికి ముఖ్య కారణం. వ్యక్తి స్వాతంత్ర్యమంటే పడిచచ్చు స్పెయిన్ దేశస్థుని హృదయంలో, ఈసిద్ధాంతం వెంటనే నాటుకుపోయింది. అరాజక వాదులకు వ్యక్తి స్వాతంత్ర్యంకన్న ఎక్కువైనది ప్రపంచకంలో, లేనేలేదు. బలవంతం అంటే ఏమాత్రం గిట్టదు. ఈవాదం ప్రస్తుత రాజకీయాల్లో ఎక్కువ ప్రాముఖ్యత వహిస్తున్నది.

లిబరిలిజం ( Liberalism ) అరాజకవాదమే (Anarchism ) కాకుండా, పరిశ్రమలు సాగుచున్న పట్టణాలలో కార్మిక ఉద్యమం గూడ బలమవుతోంది. సోషలిజం కమ్యూనిజం గూడ తీవ్రంగా ప్రచారంలోకి వచ్చాయి. ఈతీవ్రవాదాలన్ని గూడ దరిద్రంతో బాధపడుచున్న ప్రజాసామాన్యంలో రోజురోజుకూ వృద్ధి అయిపోయినయి.

19 వ శతాబ్దం చివరలో, స్పెయిన్ రాజ్యాంగమును ప్రజాస్వామిక పద్ధతులమీద నడుపుటకు పార్లమెంటు నిర్ణయించింది. ఈనిర్ణయం కాగానే పార్లమెంటు చర్చికి. రాజ్యాంగముకు సంబంధంలేకుండ వేరు పరచుటకు ప్రయత్నించింది. అదే కాకుండా, సైన్యంలో కొన్నికట్టుదిట్టములు, క్రొత్తరకం శిక్షణ గూడ ప్రవేశపెట్టాలని: తలచింది. సైన్యముకు, చర్చికి గల సంబంధమును మార్చుటకు. ఇంతవర కెవరును ఎప్పుడూ జోక్యం కలుగజేసుకోలేకపోయారు. కనుక, ఎప్పుడైతే పార్లమెంటు, ప్రజాస్వామిక కార్యక్రమాన్ని అమలులో పెట్టుటకు ప్రారంభించినదో, సైన్యంలో తిరుగుబాటు జరిగింది. ధనికబలముతో కూడిన చర్చియే దీనికి కారణం. వెంటనే తిరుగుబాటు అణచివేయబడింది. దీనివల్లగూడ చర్చియందు, సైన్యమందు ప్రజలయొక్క విరోధం వృద్ధి అయింది. లాటిఫండియా పద్ధతివల్ల దేశంలో కమ్యూనిజం చెలరేగింది. చర్చికి రాజ్యాంగములోగల అధికారం, ధనికబలం నశించేవరకు స్పెయిను దేశస్థులకు మోక్షం లేదని ప్రతివాడికి అర్థమయింది.

[సత్యనారాయణగారు స్పైన్ రాజకీయాలగురించి వ్రాసిన వ్యాసాలలో ఇది మొదటిది. ఇంకా వారి వ్యాసాలు కొన్ని వరుసగా ప్రకటించుతాం. సం.]

## రాజకీయఖైదీల విడవాలి!

( 3వ పేజీ తరువాయి. )

యాతన లనుభవించుచున్న తదితర రాజఖైదీల విముక్తికొరకు సభలనొనర్చియు అచట వ్యాఖ్యానములచేయుచు తమ యుపన్యాసములలో చట్టవిరుద్ధములగు పదముల నుపయోగించుచున్నారను యాలోచన మరొకటి. రాజకీయ నిర్బంధితుల సమస్యను పరిష్కరింప నెంచియున్న కాంగ్రెసు మంత్రివర్గము వారి మార్గములో నైయుపన్యాసములు బాధకరములుగా యున్నవట. అనగా యీరాజకీయ ఖైదీల విముక్తికైయాందోళన నలుపుటయే అనుచిత మన్నమాట. నేటివరకు కాంగ్రెసు ఏసమస్య కొరకై ఆందోళనము సాగించుచు వచ్చినదో, ఏవిషయమై యితరప్రాంతాలలో తీవ్రమగు ఆందోళన సాగుచున్నదో, దానికొరకై అనగా యీఖైదీల విముక్తి విషయమై కాంగ్రెసుమంత్రివర్గములుగల ప్రాంతాలలో ఎట్టి ప్రశంసయు తేగూడదట. నిముక్తులైన రాజకీయఖైదీల దృక్పథముతో చూచియనడల రాజకీయఖైదీ యను నామము లేకుండ ఎల్లరను వదలుట ప్రభుత్వపు ప్రధానకర్తవ్యము. ఇతర ఖైదీలందరు ఎంతవరకు విడుదలపొందరో అంతవరకు నీ విముక్తులైన వారలు నిశ్చింతగ నిద్రించజాలరు. దెబ్బ తగిలినవారికే అందలిబాధ తెలియగలదు.

మరొక విషయము. మార్లో దొర ఐర్లండులో "సెక్రటరీ ఆఫ్ స్టేట్" గా యున్నపు డీవిధముగనే రాచకీయ నిర్బంధితుల సమస్య నెదుర్కొనవలసి వచ్చెను. అందరిని వదలుటకు నిశ్చయింప బడెను. నాలుగైదు రోజులలో అందరును వదలివైతురు. ఈలోపుననే టెర్రరిస్టులొక రాజోద్యోగిని సంహరించిరి. ఇట్టి భయానకమగు ఘటన సంభవించినను మార్లే తన కర్తవ్యము మరువలేదు. ఆ ఖూనీ జరిగెనను కారణమును పురస్కరించుకొని ఖైదీల విడుదల నాపుటకై యతడెంచలేదు. నియమించిన రోజుననే సరిగా అందర ఖైదీలను వదలివైచెను. తర్వాత చాల కాలమువరకు ఐర్లండు రాజకీయహత్యలేవియు జరిగినవికావు. యీ ఘటనతో పోల్చిచూచిన నేటి మనకాంగ్రెసు మంత్రివర్గముల మనోవృత్తి నేమనవలెనో తెలియకున్నది. కేవలము మితవాద పక్ష నాయకుడగు మార్లేగారి ఎదుట వీరెంత దుర్బలహృదయులో తెల్లమగుచున్నది. మార్లేగారు మరొకచో "పోలీసువారి మాటలనువిని ఏకార్యమైనను యొనర్పబూనుచో నేర్పడు పరిస్థితి భయంకరముగను క్లిష్టముగను నుండును. అద్దానినుండి వెలుపడుట చాలకష్టతరమని" తమ యుద్దేశ్యమును వెలిబుచ్చిరి. ఒకవైపు దండనీతి యుపయోగింప బడుచుండ దానికి ప్రతిక్రియా రూపముగ టెర్రరిజం ఏర్పడును. ఈ టెర్రరిజము నణచుటకు యింకతీవ్రమైన దండనీతి నను కరింపవలసి యుండును. ఇందువలన ఇవి యింకను ప్రజ్వరిల్లి దేశమునందెల్ల వ్యాపించును. యిక దీనికంత మేది? యీపరిస్థితి గ్రహించియే మార్లో సమాధానపద్ధతి ననుకరించెను.

భారతదేశ విషయములో మార్లోగా రనుసరించిన విధానముగూడ నిచట నుదహరించు చున్నాను. భారతదేశమునకు వైస్రాయిగనుండిన మింటో దొర ఒక పర్యాయము యీదేశమున మార్షల్‌లా జారీచేయుటకు మార్లో దొరవద్దనుండి అధికారము కోరెను. అంతట మార్లో "బ్రిటిషు పరిపాలనలో గూడ నిట్టి భయానక చట్టము ఉండుచో, రష్యాలోని జారు ప్రభుత్వమునకు దీనికినిగల యంతరమేమి. భారత దేశములో మార్షల్ విధానము ప్రవేశపెట్టగనే అవిషయమై పార్లమెంటులో ప్రశ్న వచ్చినదానికి జవాబొసగు బాధ్యత నేను వహింపజాలనని వైస్రాయికి జవాబొసగెను.

టెర్రరిజము నేడు యిండియాలో అంతరించినది. నేడు తమపూర్వ మనోవృత్తిని వదలి ఎందరో కాకోరీ ఖయిదీలు కాంగ్రెసు కార్యక్రమములో పాల్గొనుచున్నారు. దేశములో వారు ప్రవేశపెట్టిన "అశాంతి" యేమియు కనపడుటలేదే? పంజాబులో నైతమనేక టెర్రరిస్టు ఖయిదీలు విముక్తులై చాలఏండ్లనుండియు రాచకీయములలో పాల్గొను చున్నారు. అందువలన గూడ దేశమునెట్టి భయంకరమగు విప్లవమును చెలరేగి యుండలేదే? అట్టిచో యింకను మన రాచకీయ ఖయిదీలు బంధితులై యుండుటకు కారణమేమి? కాన్పూరులో 144 వ సెక్షన్ ప్రయోగింపబడుటకు అచట వ్యాపించిన విప్లవమేది? మింటో సమయమునందలి యాందోళనలో యిది ఎన్నవ వంతు? మన కాంగ్రెసు మంత్రివర్గములు తమశక్తిని గ్రహించియుండలేదు. నేటి ప్రపంచరాచకీయ పరిస్థితులలో బ్రిటిషువారు యిండియాతో నెట్టివైరమును పెట్టుకొన నెంచరు. ప్రపంచపరిస్థితి బహు భీషణముగ పరిణమించు చున్నది. యీవిషయమునే మనము గ్రహింపజాలనిచో రాజనీతియందు మనమింకను బాల్యదశయందున్నా మని చెప్పక తప్పదు.

ఒకటి రెండు ఉదాహరణము లొసగి యీవ్యాసమును ముగించుచున్నాను. ఈజిప్టుదేశమున నొక రాజకీయ కుట్రకేసు సందర్భమున విచారణ ఒక ఆంగ్లేయ న్యాయాధిపతి యిరువురు దేశీయ న్యాయాధిపతుల సమక్షమున జరిగెను. నిందితులపై అనేక హత్యానేరములు మోపబడెను. ఆంగ్లేయ న్యాయాధిపతి దేశీయ జడ్జిలకు వ్యతిరేకముగ తీరుపునొసగినను ఆరాజఖయిదీల నెల్లరను వెంటనే వదలివైచిరి. ఆ యాంగ్లేయ జడ్జి యీ విషయములో చాల అన్యాయము సంభవించినదని యింగ్లండువారికి అప్పీలు చేసెను. దేశీయజడ్జీలు అపరాధులని ఎరిగియుండియు తమ సోదర నిందితులను వదలిరి. యీవిషయమై చరిత్రకారులు గూడ నా జడ్జీలు నిందితులని తెలిసియు నా ఖయిదీలను వదలిరని వ్రాసియుండిరి. నేటి మన కాంగ్రెస్‌అధికారు లీ విషయమును గ్రహించియైన రాజకీయఖయిదీల సమస్యను సరిగ పరిష్కరించెదరని నమ్మెదము.

...ావళి

### స్వర్గమంటే...?

౧

కుల భేదాలు
కూలి పోయి
లోక మంతా
ఐక్య మైతే
  స్వర్గమంటూ వేరే వుందా?
  స్వర్గమంటే ఇదే కాదా?
కార్మిక జనులు
కష్టాలు మరచి
కాయకష్టం
పంచుకుంటే
  స్వర్గమంటూ వేరే వుందా?
  స్వర్గమంటే ఇదే కాదా?
స్వర్గ మంటూ
నరక మంటూ
స్వార్థ పరుల
సృష్టియె కాని
  స్వర్గమంటూ వేరే వుందా?
స్వర్గ మంటే ఇదే కాదా?

తాడినుళ్ల బసవరాజు బి.ఏ.

8. దేవుణ్ణి గీవుణ్ణి
దేవురించెదవేల
సోమారి పోతుకూ
జడిసి కృంగెద వేల లే॥
9. ప్రకృతీ ప్రాసాద
ఫలితాన్ని పొందంగ
శక్తిహక్కులు నీదు
చేతిలో నుండంగ, లే॥

గద్దె లింగయ్య



## రాచర్ల స్టేషన్ పోలీసుల దౌర్జన్యములు.

కొత్త సబ్ ఇన్‌స్పెక్టరు వచ్చి దాదాపు నెలకౌతుంది. అతను కొన్ని రోజులక్రిందట, మొహదీన్ పురంలోనుండా వెళ్ళుచుండగా, గ్రామ నివాసస్థుడైన ఒక చాకలిమునిపి, మీ కేప్పూరయ్యా? అని అడిగినాడట. అడిగినంత మాత్రమునకే వానిమీద పడి నిష్కారణంగా, చావుదెబ్బలు కొట్టినాడు.

కాంగ్రెసు మంత్రివర్గము తన జాగ్రత్తతీసికొని యిటువంటివి జరుగకుండా చూడవలసిం దని ప్రార్థన.

నేగిరెడ్డి బాపిరెడ్డి
కార్యదర్శి కర్నూల్ జిల్లా రైతు సంఘము.

## ఋణవిమోచన చట్టం
## బహిరంగ సభలు

ఆంధ్రరాష్ట్ర రైతు సంఘంవారి ఆజ్ఞానుసారం భీమవరం తాలూకాలో ఈ క్రింది గ్రామములనుంచి రైతు సభలు గావించి తీర్మానములు గావించి మదరాసు రాజధాని ప్రధానమంత్రిగారికి పంపుచున్నారు. 1 కొండాడ, 2 కవిగొట్లు, 3 గరగపర్రు, 4 పాలకోడేరు, 5 చిలుకూరు 6 గొల్లలకోడేరు 7 ఉండి, 8 నూర్పరాజుపేట, 9 నవుడూరు, 10 కోనితివాడ, 11 అండలూరు, 12 యింగర్ల అగ్రహారం, 13 మహాదేవపట్నం, 14 కోవ్వాడ, 15 ఆకాకోడేరు 16 కాళ్లకూరు, పంపినారు. యింకా కొన్ని గ్రామాదులనుంచి తీర్మానములు గావించినట్లు తెలియుచున్నది. ఆ గ్రామాదుల కాపీలు శాసనసభ మెంబరుగారికి పంపుచున్నారు.

డి॥ శ్రీరామమూర్తి
కార్యదర్శి
తాలూకా కాంగ్రెసు సోషలిష్టుపార్టి
భీమవరం.

## స్వాతంత్ర్యదినోత్సవం

### రాజమండ్రి

26-1-38వ తేదీన కాంగ్రెస్ భవనంలో కామ్రేడ్ లింగరాజుగారిచే జాతీయ పతాకోత్సవం జరిపబడింది. సాయంత్రం వారి అధ్యక్షతక్రిందనే శ్రద్ధానందఘాటులో బహిరంగసభ జరిగింది.

స్వాతంత్ర్య దినమునకు సెలవీయనందున విద్యార్థులు సమ్మె చేసి ఉత్సవాల్లో పాల్గొనిరి.

సభలో, వెన్నేటి సత్యనారాయణగారు, విద్యార్థులు స్కూలు మానినందుకు సంతసించినా, మంత్రులు మనవారు గనుక కట్టుబాటు గలిగి ఉండాలని, చెప్పారు. దీనితో వాదోప వాదాలు చెలరేగాయి. తర్వాత మాట్లాడిన పలువారూ, వెన్నేటివారిని, విమర్శించి, విద్యార్థుల చర్యలను సమర్థించారు.

యర్రమిల్లి జగన్నాథశాస్త్రిగారు, రాజకీయపోరాటాన్ని సింహావలోకనం చేస్తూ, మంత్రిపదవీ స్వీకారం, బాట్లీవాలాను అరెస్టు చేయడం, కాంగ్రెసు మితవాదపద్ధతులకు పోతున్నదని, దానిని జాగ్రత్తగ బ్రిటిష్‌వారితో పోరాడేందుకు తీవ్రతరం చేయాలని చెప్పారు. బందిరి మల్లికార్జునరావుగారు, కార్మికకర్షకుల సంఘటన, యునైటెడ్ ఫ్రంటు ఆవశ్యకతగురించి మాటాడారు.

రామచంద్రుని వెంకటప్పగారు త్వరలో రానున్న స్వాతంత్ర్య యుద్ధానికి ఆహుతి అయేందుకు తయారుకావలెనని యువకుల హెచ్చరించారు.

స్వాతంత్ర్య దినముయొక్క చరిత్రను గురించి మరికొందరు మాటాడారు.

అధ్యక్షులు సభముగించుచూ, హింస- అహింస అనేది తాత్విక సమస్య అని, సామ్రాజ్య విరోధ పోరాటాన్ని సాగించాలని తెల్పుచూ, స్వాతంత్ర్య ప్రమాణము చదివి సభముగించారు.

### విద్యార్థుల సమ్మె

స్వాతంత్ర్యోత్సవ దినముగుటచే ఆర్ట్సు కాలేజీ విద్యార్థులు సెలవడిగిరి. కాని సెలవు నిరాకరింపబడుటచే సమ్మె చేసిరి. కామ్రేడ్ సత్యనారాయణాచారిగారి అధ్యక్షతక్రింద కాంగ్రెస్‌భవనములో సభ జరిపిరి. అధ్యక్షులు, అరవ అదినారాయణమూర్తిగారు విద్యార్థుల చర్యను ప్రశంసించిరి.

### కామ్రేడ్ కమలాదేవి రాక.

29-1-38 వ తేదీన కామ్రేడ్ కమలాదేవి (ఛటోపాధ్యాయ) గారి పట్టణము వచ్చిరి. స్టేషన్‌వద్ద సోషలిస్టు పార్టీవారు, కాంగ్రెసు ప్రముఖులు, మహిళాసంఘంవారు స్వాగతమిచ్చిరి.

విద్యార్థుల సభ, మహిళాసభ, రైత్వేకార్మికుల సభలలో మాటాడిరి.

సాయంత్రము, 6 గంటలకు శ్రద్ధానంద ఘాటువద్ద పుష్కరాంబ గారి అధ్యక్షతను బహిరంగసభ జరిగినది. ఎం. కమలాదేవిగారు పెట్టుబడిదారీ విధానంవలని చెడుగులను గురించియు, హిందూదేశమున సోషలిస్టు పార్టీ పుట్టుక గురించియు ఉపన్యసించిరి.

### జమీందింటకుఱ్ఱు

అఖిల భారత కాంగ్రెసు సర్క్యులర్ ప్రకారం జమీందింటకుఱ్ఱు కాంగ్రెస్ సంఘమువారున్ను, రైతుసంఘము వారున్ను, యువజన సంఘమువారు కలసి, ప్రతిసెంటరునందును ఈరోజుయొక్క ప్రాముఖ్యతను దెల్పుచు బ్రహ్మాండమైన యూరేగింపుచేసి జాతీయపతాకోత్సవము జరిపినారు ఈ కార్యక్రమములో రైతు సోదరులందరు ఉత్సాహములో పాల్గొనిరి. అంత్యమున అధ్యక్షస్థానము నలంకరించిన జాస్తి పున్నయ్యగారు ప్రస్తుతము యువజనుల కర్తవ్యమును విశదపరచిరి.

### కొక్కిరిగడ్డ

ది. 26-1-38 తేదీ కొక్కిరిగడ్డ గ్రామ యువజన సంఘమువారు కామ్రేడ్ ఈడ్పుగంటి పరమేశ్వరరావుగారి అధ్యక్షతక్రింద స్వాతంత్ర దినోత్సవమును జయప్రదముగా జరిపిరి. కామ్రేడ్ కోనేరు రాజగోపాలరావుగారు స్వాతంత్ర్య దినోత్సవమును గురించి చెప్పుచు 1857 వ సం॥ నుండి నేటివరకును జరిగిన స్వాతంత్ర్య పోరాటములను గురించి విపులముగా చెప్పియుండిరి. చివరకు కరతాళధ్వనులతో సభ ముగిసెను.

### సోంపేట

సోంపేట:- నిన్న భారతస్వాతంత్ర దినోత్సవములు జయప్రదముగా జరిగెను. స్థానిక కాంగ్రెసుసంఘ యాజమాన్యము నీసాయంత్రము 3 ఘం॥కు నగరసంకీర్తనజరిగిన తదనంతరము గాంధీ మండపమువద్ద బహిరంగసభ జరిగేముందు పతాకోత్సవము జరిగెను. బహిరంగసభలో స్థానికకాంగ్రెసు ప్రముఖులగు శ్రీ బత్తుల సీతయ్యగారు మాట్లాడినపిమ్మట జిల్లారైతుసంఘ కార్యదర్శిగారగు శ్రీగౌతు లచ్చన్నగారు స్వాతంత్ర దినప్రాముఖ్యత ఆశయములగూర్చి మాట్లాడుచు జాతీయ మహాసభ తీర్మానము జపులముగా అందరికి అర్థమగునట్టుల మాట్లాడిరి. సంపూర్ణ స్వాతంత్రముకై రైతులు కూలీలు కేంద్రీకరించ వలసియున్న కార్యక్రమము స్పష్టపరచిరి.

### బారువ

బారువలో స్థానిక కాంగ్రెసు సంఘాల యాజమాన్యమున జాతీయజెండాలు తోరణాలు ప్రజల కోరికలు తెల్పు జెండాల ప్రకటనబోర్డులతో రైతుబాధలి గీతములు పాడుకుంటూ బ్రహ్మాండమైన వూరేగింపు జరిగెను. బహిరంగసభవద్ద జాతీయజెండాలతో కూడా యెర్రజెండా వందనోత్సవము జరిగెను. సభలో మర్తింటి సత్యనారాయణగారు (హరిజనసేవాసంఘ కార్యదర్శి) గౌతు లచ్చన్నగారలు మాట్లాడిరి. కాంగ్రెసు చరిత్ర ప్రస్తుతపరిస్థితులు స్వరాజ్య స్వరూపము స్వతంత్రదిన ప్రమాణ తీర్మానములతో పాటు స్థానికములో రైతులకు జమీందారులకు ప్రస్తుతమున్న తగాదా కారణములు రైతుల కర్తవ్యము గూర్చి విపులముగా తెలుపబడెను. రాత్రి 8 ఘం॥కు సభ సమాప్తమయ్యెను.

బారువ, ( ఒక విలేఖరి. )
27—1—38.

### ఖాజీపాలెం యువజన సంఘం

బాపట్ల తాలూకా ఖాజీపాలెం గ్రామ యువజన సంఘ సమావేశము శ్రీయుత పెంట్యాల లోకనాథంగారి అధ్యక్షతను జరిగెను. అధ్యక్షులు యువజన సంఘముల ఆవశ్యకతను గురించియు యువకులు ప్రజా సామ్రాజ్యములో చేయవలసిన ప్రబోధమును గూర్చియు వుపన్యసించిన పిదప ఈ దిగువ తీర్మానములు ఏకగీవముగా ఆమోదించ బడెను.

(1) పూంటేబ్యాంకు కేసు ఖైదీలు రాజకీయ ఖైదీలు కాదని ప్రధానామాత్యులు పలుకుట శుద్ధతప్పు వారు కూడా రాజకీయ ఖైదీలే గావున యెట్టి ఆలస్యము చేయక సదరు ఖైదీలను, అలాగే హైదర్ ఖానుగారిని వెంటనే విడుదలచేయ వలయునని ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

(2) కామ్రేడ్ భయంకరాచారిగారి వెంట సి. ఐ. డీలనుంచుట రాజాజి సమర్థించు కొనుచు చెప్పిన మాటలు అసమంజసముగా నున్నవి. అట్లు రాజకీయవాదులపైన సి.ఐ.డీలను వేయుట కాంగ్రెసు ప్రతిష్ఠకే భంగకరముగాన వెంటనే సి.ఐ.డి శాఖ రద్దు చేయవలయునని కాంగ్రెసు మంత్రులను ఈ సభవారు కోరుచున్నారు.

3 కాంగ్రెసు నాయకులైన శ్రీయుత కాశేశ్వరరావుగారు మద్రాసులో వుపన్యసించుచు హిట్లరు ముస్సోలనీలను దేశభక్తులని చెప్పినందులకు నిరసించుచు ఇట్టిఫాసిస్టు అభిమానులను కాంగ్రెసులో తల యెత్తనీయకుండా చేయవలయునని యువకులందరిని ఈ సభవారు హెచ్చరిస్తున్నారు.

4. యువజన సంఘము తరఫున నవశక్తి పత్రికను తెప్పించుటకును. ఒక ప్రత్యేక గ్రంథాలయము స్థాపించుటకును తీర్మానించిరి. తరువాత సభ ముగిసెను.

రంగావఝ్ఝుల పరశురామయ్య,
కార్యదర్శి.

# అమృతాంజనం

## అన్ని నొప్పులకు దివ్యామృతం

ఆంధ్ర దేశ యువతీ యువకులు అర్థశాస్త్రజ్ఞులుగా, రాజకీయవేత్తలుగా, స్వాతంత్ర్య వీరులుగా, తయారు కావాలంటే, దేశదాస్యమును తొలగ త్రోయాలంటే,

### అతివాద గ్రంథ మండలి

పుస్తకాలు చదవండి. సభ్యులుగా చేరండి. చవుకలో-గ్రంథాలు—కరపత్రాలు ప్రకటిస్తాము.

అతివాద గ్రంథమండలి యొక్క గ్రంథములు త్వరలో రానున్నవి.

వెంటనే సభ్యత్వము పొందండి.

అన్ని చోట్లకు ఏజంట్లు కావలయును.

ఉత్తర ప్రత్యుత్తరములు జరుపువారు 0-1-0 బిళ్ళను పంపు చుండవలయును.

వివరాలకు:—

అన్నాప్రగడ కామేశ్వర రావు

అతివాద గ్రంథమండలి,

గుంటూరు.

---

### సోషలిజాన్ని గూర్చి

తెలుసుకోవాలంటే 'విశ్వసాహిత్యమాల'

పుస్తకాలు చదవండి.

| | |
|---|---|
| సోషలిజం ఎందుకు ? | 1—0—0 |
| నా రష్యాయాత్ర | 0—8—0 |
| [illegible]నియాటు కమ్యూనిజం | 0—6—0 |
| [illegible] ప్యానిఫెస్టో. | 0—6—0 |

వివరాలకు వ్రాయండి. తెలుగులో ఏ రాజకీయ గ్రంథం కావలసినా....

### విశ్వసాహిత్యమాల

ముంగండ (via) అంబాజీపేట.

---

మద్రాసు ప్రభుత్వపు నిరంకుశత్వానికి గురియై నిషేధింపబడి

ఇటీవల కాంగ్రెసు మంత్రులచే నిషేధము తొలగింపబడిన

### ★ అమ ★

లోని విశేషమేమిటో ఒకసారి చదివి తెలుసుకోండి.

బైండు చేయబడిన 700 పుటల గ్రంథము.

రూపాయిన్నర మాత్రమే.

కావాలిస్తే:—

గద్దె లింగయ్య

యలమర్రు, కృష్ణాజిల్లా.

అని వ్రాయండి.

---

### కొక్కోకము

స్త్రీపురుషరహస్యములు 64 చిత్రపటములతో 232 పేజీలుగల పెద్దపుస్తకము. ధర రూ. 1-0-0 పోస్టు ఖర్చులు అ. 5. ఇందులో స్త్రీపురుష శృంగార రహస్యములు, శయ్యాగృహ మర్మములు గలవు.

### ముద్దుల మర్మములు

పడకటింటి ముచ్చటలు, రతి సంబంధమైన అనేక మర్మవిషయము లిందుగలవు. 8 పటములతో 148 పేజీలుగల పెద్దపుస్తకము, ధర రూ. 0-8-0, పోస్టు ఖర్చులు 5 అణాలు. కొక్కోకము ముద్దులమర్మములు ఓదఫా తెప్పించుకొనిన పోస్టుఖర్చులు ఇనాం, రు. 1-12-0 మాత్రము.

### చేతిపనుల వర్తకరహస్యబోధిని

సబ్బులు, సెంటులు, పరిమళ తైలములు, బాణసంచా అత్తరు, పన్నీరు, పిప్పర మెంటు మందులు మొదలగు నవి సులభముగా తయారుచేయు పరిశ్రమలు 400 గల 200 పేజీలుగల పెద్దపుస్తకము. ధర 1 రూపాయి. పోస్టుపా ఖర్చులు 6 అలు.

మహారాజ పుస్తకశాల,

అరుణాచల మొదలివీధి, 18 నీటు మదరాసు.

---

### Professor's Paroxysm

An illuminating drama for Students and Progressive thinkers

2 Annas a copy excluding Postage. Apply to:—

Navasakti Office,
Rajahmundry.

---

### సుధాచంద్రిక

సీసా 1కి రు 2-0-0

సుధాచంద్రిక గనేరియా కారణములగు క్రిములను సంహరించి వ్యాధిని మొదలంట రూపుమాపును మొదటి మోతాదుతో స్రావము కట్టివేయును. మూత్ర నాళమందలి మంట తగ్గించును. ఇతరౌషధములకు లొంగని కేసు సహితము కుదుర్చును.

### వసంతకుసుమాకరం

తు1కి రు 10-0-0

వసంత కుసుమాకరం తు 1 కి రు 10—0—0లు శాస్త్రీయముగ తయారు చేయబడినది. శరీరదారుఢ్యమును వరముల పటుత్వమునిచ్చును. అతి మూత్రము, మధుమేహము రాచపుండులకు ప్రసిద్ధి కెక్కినది. కేట్లాగు ఉచితం.

క్షీరసముద్రం ఫార్మసీ,

రాజమండ్రి

---

### మరబియ్యం తినడం!

### మరణబాధ పడడం!

మానవ జీవితానికి ఆహారం అవుసరం

ఆహారంలేక జీవించుడం అసంభవం

పుష్టికర ఆహారం ఆయుర్దాయాభివృద్ధి కల్గించుతుంది

కాని మీరుతినే మిల్లుబియ్యంలో

పుష్టికర పదార్థాలు లోపించివుంటాయి

అందువల్లే, అనీరసం- అజీర్ణం-అనుకరించిపోవడం

లోపించిన పదార్థాలు చేరుకునేందుకు దంపుడు బియ్యం వాడాలి మేము గత ఐదుసంవత్సరముల నుంచి స్వయముగ ధాన్యం దంపించి విరివిగ సప్లయి చేయుచున్నాము, మానమ్మకమును వెల్లడిచేయుటకు, మావద్దగల దృవపత్రములే సాక్షి.

భమిడిపాటి సూర్యనారాయణమూర్తి

అండ్ బదర్సు.

గంగాచారి రోడ్డు, రాజమండి.

---

### శ్రీదుర్గా జ్యోతిషాలయమ్.

జాతక చక్రమువేయుటకు రెండు రూపాయలు సం॥ర ఫలితములు నెల వారీగా ఐదురూపాయలు. జీవితమంతయు అన్ని భావములు వ్రాయుటకు పదిరూపాయలు. నాల్గుప్రశ్నలకు ఒకరూపాయి మాత్రమే!

రక్షరేకులు యివ్వబడును.

గుణములేనిచో సొమ్ము వాపసు చేయబడును.

| | |
|---|---|
| సర్వకార్యార్థ సాధనకు | 2—0—0 |
| సంతాన ప్రాప్తికి | 5—0—0 |

యింకా ఇతరమైన వాటికి కవచములు (రక్షరేకులు) ఇవ్వబడును. అన్నిటికి పోస్టేజీ అదనము

బ్రహ్మ విద్యోపాసి

పండిట్ యస్. రాజశేఖరశాస్త్రి

నెం. 10 డి. ఎడ్వర్డు యిలియట్ రోడ్డు

"చింతామణి" మైలాపూరు

మద్రాసు

---

### ★ నవశక్తి ★

| | |
|---|---|
| సంవత్సర చందా | 3—0—0 |
| అర్ధ సంవత్సరం | 1—10—0 |
| విడి ప్రతి | అణా. |

మేనేజర్, నవశక్తి—రాజమండ్రి

Printed by V. Suryanarayana Sastry at Srinivasa Press } Rajahmundry

# రాజన్ బాబుకు 

# సహజానందసరస్వతిలేఖ!

> బీహార్‌లోని కాంగ్రెస్ కిసాన్ సంఘర్షణ ఫలితంగా, స్వామి సహజానంద, తన రాష్ట్ర కాంగ్రెస్ కార్యనిర్వాహక పదవికి రాజీనామా నిచ్చారు. రాజేంద్రప్రసాద్‌కు వ్రాసిన లేఖలో, స్వామిజీకి గల అకుంఠిత దేశభక్తి, కాంగ్రెస్ యెడల గాఢ విశ్వాసం ఆయన యెడ కొందరు "అహింసావాదు" లే, "సత్యవ్రతాచరుణులే" చేసిన అపకారం, దాని ఫలితంగా ఆయనకు గల్గిన మనోవేదన స్పష్టమౌతున్నాయి.
>
> ఈలేఖ యొక్క అవశ్యకతను గుర్తించి అనుబంధముగా ప్రకటించుచున్నాము.
>
> -సంపాదకుడు.

★ ★ ★

బీహార్ ప్రాంతీయ కాంగ్రెసుకమిటీ కార్యనిర్వాహకవర్గ సభ్యత్వానికి రాజీనామా ఇస్తూ బీహార్ రైతు నాయకుడయిన స్వామి సహజానంద సరస్వతి గారు బాబూ రాజేంద్ర ప్రసాదు గారికి ఈ క్రిందివిధముగా జాబు వ్రాసారు.

"ఈ కార్య నిర్వాహక వర్గ సభ్యత్వానికి రాజీనామా ఇవ్వడంలో నాకెంత మనోవేదన ఉందో అది నా కొక్కనికే తెలుసు. పరిస్థితులు నాకింకో గత్యంతరం లేకుండా చేశాయి. ఈ రాజీనామాను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

కొన్ని సంవత్సరాలనుంచి ఎడతెగకుండా ఈకమిటీ సభ్యునిగా ఉండి కాంగ్రెసుకు నేనుచేసిన కొద్ది సేవయు గడచిన లెజిస్లేటివు అసెంబ్లీ ఎన్నికలలో, లెక్కపెట్టడానికి వీలు లేనన్ని భేదాలున్నా, కాంగ్రెసు ప్రతిష్ట కోసము ఈకమిటీని వదలకుండా కాంగ్రెసు గౌరవం నిలబెట్టటానికి నే పడిన కొద్దిపాటి ప్రయత్నాలే. నేడు చాలా దుఃఖముతో రాజీనామా పెట్టడానికి నన్ను బలవంత పరుస్తున్నాయని తమరికి మొట్టమొదట విన్నవం చేసుకొంటున్నాను. ఆరోజుల్లో నేను మీకు వ్రాసిన రెండుత్తరాలు మీదగ్గరే ఉండి యుండాలి. అవి అప్పటి నా మానసికావస్థను స్పష్టంగా తెలుపుతాయి. ఆభావంలో కాస్తకూడా మార్పురాలేదని నేనంటే మీ రది నమ్మక తప్పదు.

కాంగ్రెసుయెడల నాకుండే భక్తి విశ్వాసాలు ఇప్పటికీ ఏమాత్రము తగ్గలేదు. తప్పు చెయ్యటము మానవ స్వభావం కాబట్టి కాంగ్రెసులోఉండే ప్రతి ఒక్క సభ్యుడు తప్పుచేసినా కాంగ్రెసు సంస్థమాత్రము ఏవిధంగానూ పడిపోజాలదని నమ్ముతున్నాను. కాంగ్రెసులోకి పాకి వచ్చే చెడుగును చూచి మనము నిరుత్సాహపడనవసరం లేదు. దానిని పీకిపారవేయడమే మన ప్రథాన కర్తవ్యం. కాంగ్రెసుచరిత్ర పరిశీలిస్తే అప్పుడప్పుడు ఇట్టి శుద్ధిసంస్కారం జరుగుతూ వచ్చిందని తెలుసుకొంటాం. ఇట్టి శుద్ధి సంస్కారం జరుగుతూ ఉండబట్టే ఇవ్వాళ మన కాంగ్రెసు ధగద్ధగాయమైన మణిలాగ మెరుస్తూ, దాని సేవచేసే భాగ్యం అబ్బే ప్రతివాణ్ణి దాన్ని భక్తిశ్రద్ధల్తో పూజించేటట్టుగా బద్ధుణ్ణి చేస్తోంది.

నేనిట్లు భావిస్తున్నా. మీ కార్య నిర్వాహక వర్గంలోనుంచి రాజీనామా యియ్యక తప్పటంలేదు. మీకమిటీకి వెలుపలుండే కాంగ్రెసుసేవ ఎక్కువగా చేయకల్గుదుననే, ఆకమిటీతో నావంటి వ్యక్తికి స్థానంలేదని రాజీనామా యిస్తున్నాను.

నేను ఇట్లా అనటానికి ఎన్నో కారణాలున్నాయి. మీరే కాంగ్రెసు రాష్ట్రకమిటీ అధ్యక్షపదవిని స్వీకరిస్తేనే తప్ప మాకు న్యాయం జరిగే ఆశలేదని నేను గడచిన ఎన్నికలముందు మీకు నేను వ్రాసియుండడం జ్ఞాపకం ఉందనుకుంటా. ఎన్నికల సంచారము తర్వాత రా. కాం. కమిటీ మీటింగులో, మాకష్టాల్ని మీరు తెలిసికొని వాటిని తొలగించే ప్రయత్నాల్ని చేయవలసి ఉన్నదనీ, మేముకూడా అలాగే మీకష్టాల్ని గ్రహించడానికి పూర్తిగా ప్రయత్నంచేసి వాటిని పరిష్కరించడములో సహాయపడతామని మీకు చెప్పడం తటస్థించింది. సందిగ్ధమైన పరిస్థితులు వచ్చినప్పుడల్లా మీరు నాకు వ్రాయడమో, కబురు పంపించడమో జరుగుతూ వచ్చేది. ఎన్నికలముందు మీరు నాకు వ్రాసిన జాబు, ఇంకా యితరమైన ఎన్నోజాబులు దీనికి సాక్ష్యము. మొన్న మొన్ననే అక్టోబరు 18వ తేదీన, 'మునీమీ'గారి ద్వారా మీరు నాకు వ్రాసిన ఉత్తరం, నవంబరు 18 వ తేదీన నాకోసం మీరు కారు పంపించడం, దీన్నే బలపరుస్తున్నాయి. అక్టోబరు 17 వ తేదీన, మీరు నన్ను ఆపి ముఖ్యమైన విషయాల్లో నాసలహా పొందటానికి మీకారులో నన్ను తీసుకెళ్ళి నాకార్యక్రమం సక్రమంగా జరిగేనిమిత్తం బీహార్‌షరీఫ్‌దాకా అరవైమైళ్ళ దూరం మీకారులో నన్ను పంపించడం తటస్థించింది,

నేనూ, కిసాన్‌సభ, అప్రత్యక్షంగా ఉరిశిక్ష పొందబోయే ఈ సమయంలోమాత్రం, నన్ను ప్రత్యేకంగా పిలవడం అవసరమని మీకెందుకో తోచలేదు. తన తోటివాడు ఉరితీయ బడటానికి ఆజ్ఞాపింప బడటం; ఒకమారైనా చెప్పుకోటానికి అతనికి అవకాశము ఇవ్వక పోవడమూనా? డిశంబరు 1 వ తేదీన, చంపారన్ జిల్లాకాంగ్రెసు కమిటీ చెప్పేమాటలు విన్నతర్వాత నాకు అవశ్యం వ్రాస్తానని మీరు జాబు వ్రాసినప్పుడు, ఈ వ్యవహారంలో ఏదో ఒకటి చేసేముందు నాకు ఒక జాబు వ్రాస్తారని గట్టిగా నమ్మి కూర్చున్నా. కాని ఆవిధంగా చెయ్యటం అవసరంలేదని మీరెందుకు తలచారో నాకుమాత్రం తెలీదు. అందువలననే, కమిటీలో నేనుండే అవసరం లేనట్టుగా భావిస్తున్నా. మీలో ఈ మార్పు రావడానికి కారణం కనుక్కుందామని ఎంత ఆలోచించినా విఫలుణ్ణౌతున్నాను.

నామీదగానీ, కిసాన్ సభమీదగానీ, వ్రాతమూలకంగానేనా, వాక్పూర్వకంగానేనా, నిశ్చితమైన నేరాలేమీ మీరు మోపకుండానే, నా గైర్‌హాజర్ లో యింత తొందరపడి ఇంత భయంకరమైన నిర్ణయానికి వచ్చారంటే నేను చాలా నొచ్చుకొన్నాను. అక్టోబరు 16 వ తేదీన జరిగిన మీటింగులో కొంతమంది కార్యకర్తల మీద అనిశ్చితమైన నేరాలు కొన్ని మీరు మోపినపుడు, నా విషయంలో ప్రత్యేకంగా ఏమైనా ఉన్నయ్యా అని మిమ్మల్ని నేను అడిగాను. మీరపుడు నా విషయంలో అట్టివేమీ లేవని స్పష్టంగా జవాబిచ్చారు. మళ్ళీ 18 వ తేదీన ముగ్గురు కార్యకర్తలమీద వ్రాత పూర్వక మైన నేరాలు మీరు నాకు చూపించారు. నాసంజాయిషీకొరకు వాటి కాపీలు కొన్నిరోజుల తరువాత నావద్దకు పంపబడ్డాయి. మీ కోరిక ప్రకారము మీకంద చెయ్యటానికి గాను, ఆకార్య కర్తల వ్రాతపూర్వకమైన సంజాయిషీలను తీసుకొని నేను కలకత్తా వచ్చాను. మీకు అరోగ్యము చెడి అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశము పూర్తియైన తర్వాత దాకా మీరక్కడికి రాలేదు.

కాంగ్రెసు అధ్యక్షునికి కిసాన్‌సభకు ప్రతికూలంగా పత్రాలు కాగితాలు మీరుపంపించి వున్నారని కలకత్తాలో ఉండగా పత్రికల్లో చూచాను. అప్పుడు ఈవిషయం నిజానిజాలు ఏమిటని, ఈ విషయంలో ఏదైన నిర్ణయము తీసుకొనేముందు నాసంగతి చెప్పుకోడానికి నాకేమైనా అవకాశ మిస్తారాలని కాంగ్రెసు అధ్యక్షునికి వ్రాసాను. అట్టి నేరారోపణ లేమీ తనవద్దకు రాలేదనీ, అట్టివి వచ్చే సందర్భములో చెప్పుకోడానికి నాకు అవకాశము కల్పింప బడుతుందని ఆయన జవాబిచ్చారు. ఈవిధంగా అక్టోబరునెల చివరదాకా మామీద నేరాలున్నట్లు తెలియదు. నవంబరు 18 వ తేదీన మనిద్దరము సదవుత్ ఆశ్రమంలో కలుసుకున్నాము. ఆముగ్గురు కార్యకర్తలు వ్రాశి యిచ్చిన సంజాయిషీలు మీకందజేసా. చిందరవందరగా ప్రచురించటంవల్ల మనలోకొన్ని మనస్పర్ధలు కలిగించిన వాఙ్మూలం యొక్క అసలు ప్రతి మీరు కోరిన మీదట అప్పుడు ఇచ్చాను. తుదకు అప్పుడు కూడా నామీదగాని, కిసాన్‌సభ మీదగాని, ఎట్టినేరాన్ని మీరు ఆరోపింపలేదు.

అటుతరువాత నామీద బహిష్కారాయుధాన్ని ప్రయోగిస్తూ చంపారన్ జిల్లా కాంగ్రెసు కమిటీ పంపిన నవంబరు 20 వ తేదీ తాకీదు, నవంబరు 26 వ తేదీన నాకు చేరింది. తక్షణం తన అసమ్మతి తెలియబరుస్తూ, రాష్ట్రకిసాన్ సభా కార్యదర్శి మీకు వ్రాశాడు. దాని విషయంలో తగిన విచారణ చేయబడుతూ ఉందని మీరు జవాబిచ్చారు, అప్పటికి గూడా నామీద గానీ కిసాన్‌సభ మీదగాని ఎట్టినేరం మోపబడలేదు. తిరిగి నవంబరు 28 వ తేదీన, పరిస్థితులు క్లిష్టంగా ఉన్నాయనీ, చంపారన్ విషయంలో మీరు తప్పక జోక్యం కలుగచేసికోవాలనీ మీకు నేను స్వయముగా వ్రాశాను. కాంగ్రెసు అధ్యక్షుడికి గూడా దీని విషయమై వ్రాస్తూ ఉన్నాననికూడా మీకు తెలియపరిచాను. డిశంబరు 1 వ తేదీ అని వేయబడి యుండిన మీజవాబు నాకు డిశంబరు 11వ తేదీన చేరింది. ఆ ఉత్తరములో కూడా నామీదైనా కిసాన్‌సభమీదైనా నేరాలున్నాయని సూచన కూడా చేయబడలేదు. నా మీదగానీ కిసాన్‌సభ మీదగానీ నిశ్చితమైన నేరాలు మోపబడిందీ, అందు విషయమై నన్ను మీరు హెచ్చరించింది ఎప్పుడో, ఇప్పటికైనా నాకు తెలియపరుస్తారని మిమ్మల్ని కోరుతున్నా. నాకేమీ ముందుగా తెలుపకపోగా, డిసంబరు 13 వ దేదీన మేము ఉరిశిక్షకర్హులమని మీరు నిర్ణయించారు. ఈనూతన ప్రపంచాన్ని ఈకొత్తమార్గాల్ని అర్థంచేసుకోలేక పోతున్నాను. ఇవన్నీ ఇలాఉండగా, గోరుచుట్టుమీద రోకలిపోటు అన్నట్టు, కార్యనిర్వాహకవర్గపు మీటింగు యొక్క నోటీసుగూడా నాకందలేదు. ఆమీటింగుయొక్క నోటీసు పోస్టు ద్వారా డిసంబరు 13 ఉదయం 10 గంటలకు బీటాకు చేరింది. సరిగ్గా ఆ సమయంలోనే మీ కమిటీ సమావేశము కూడి ఉండటం, నేను సారన్ జిల్లాలో పర్యటనము చేస్తూ ఉండటం తటస్థించాయి

ఈ కాండ అంతా మీద్వారా జరుపబడటం, నాకు సూచన ఏమీ ఇవ్వబడక పోవడం. ఇది వింతగా

## "అవసరమయితే తమజీవితాన్ని కిసాన్ సభ జీవితాన్ని కాంగ్రెసుకు బలినివ్వ సంసిద్ధులైన వారు కాంగ్రెసుకు శత్రువులా!"

ఉన్నది. కాని పత్రికల రిపోర్టులను ఆధారంగాచేసికొని. మా కార్యకర్తలు కొందరు కాంగ్రెసు మంత్రివర్గాన్ని కూడని విధంగా విమర్శన చేస్తూ ఉన్నారేమో అని నేను బయపడి సర్క్యులర్ల ద్వారా పత్రికలద్వారా. విమర్శన స్నేహపూర్వకంగానూ నిర్మాణాత్మకంగానూ ఉండాల్సిందనిన్నీ విరోధభావంగా ఏమాత్రం ఉండకూడదనిన్నీ, వాళ్ళని హెచ్చరిక చేసాను. అహింస విషయంలో చూస్తే, లెఖ్ఖకు మించినన్నిసార్లు దాని ప్రాముఖ్యతను ప్రజలకు తెలియబరచాం. తెలియపరుస్తూ ఉన్నాము కూడా. దౌర్జన్యం రైతులకు క్షేమకరము కాదని మేము పూర్తిగా నమ్ముతున్నాము.

చంపారన్, సారన్‌జిల్లా కాంగ్రెసు కమిటీలు తొందరపడి నేను చాలా అపాయకరమైన వ్యక్తినని ప్రకటించి, నేనేమి చెప్పుకోటానికి కూడా అవకాశము కల్పించక పోవడము నాకు చాలా విచారాన్ని కలుగ జేసింది. అతి నిరంకుశ ప్రభుత్వం కూడ ఇట్టి పనుల్ని చేయడంలేదు. మనమందరం ఒకే ఆదర్శం కొరకు పోరాడుతూ ఉన్న కామ్రేడ్స్‌ము గదా! ఆ కమిటీలు నన్ను కనీసం సంజాయిషీ అయిన అడిగిఉన్నట్లయితే. నాకింతవిచారం కలిగియుండెడిది కాదు. నేను గూడ రాష్ట్రీ కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గ సభ్యుణ్ణి గదా. కిసాన్ సభ యొక్క అధ్యక్షుణ్ణి అయి ఉండినంత మాత్రాన, నా తక్కువ హోదాను నేను కోల్పోను కదా. వేరు వేరు వుద్యోగాల హోదాల్లో వ్యత్యాసముండే వుపన్యాసాలు నేను యివ్వను. దానిమీద నేను మీకు అపీలు చేసుకొన్నప్పుడు మీవద్దనుంచి కూడ ఏమి సానుభూతి పొందక పోయేటప్పటికి నా మనోవేదన వర్ణనాతీతమైనది. పైపెచ్చు నేను ఎప్పుడూ ఏమాత్రం సందేహింపని స్థలాన్నుంచి 13, 14 తేదీలందు హఠాత్తుగా నామీద బాణం వేయబడింది. నిన్న మొన్నటి దాకా కాంగ్రెసు సంస్థకు పరమశత్రువులును. దేశద్రోహులును అయిఉన్న జమిందారులు. వాళ్ళ కనుసన్నల్లో మెలుగుతూ ఉన్న దాసులు వొక్క క్షణంలోనే కాంగ్రెసుకు మిత్రులును. కాంగ్రెసుకు సహాయపడేవాళ్లగాను అయిపోయారా! ఎవరయితే అవసరం వచ్చినప్పుడు తమజీవితాల్ని. కిసాన్ సభయొక్క జీవితాన్ని. కాంగ్రెసుసంస్థ కొరకు సంతోష పూర్వకంగా బలినివ్వ సంసిద్ధులుగనున్నారో, వాళ్లు కాంగ్రెసుకు శత్రువులా! ఇట్టి దుర్భర కఠోర దృశ్యాన్ని చూచే దురదృష్టం మాకు కలిగింది. మీ కార్య నిర్వాహక వర్గం కూడా ఎట్టి సంజాయిషీ అడగకుండానే క్రింది కమిటీల ఈ అమానుష కృత్యాన్ని ఆమోదించిందంటే మేమేం చేయాలో తెలియటం లేదు.

మాంఘేర్ జిల్లా కాంగ్రెసు కమిటీ ఇతర కమిటీలను మించిపోయింది. ఆ కమిటీ కిసాన్‌సభంతా పూర్తిగా చట్టవిరుద్ధమని నిర్ణయించింది. ఇట్టి కార్యం వాక్స్వాతంత్ర్యం, సంఘ స్వాతంత్ర్యం మొదలుగాగల ప్రాథమిక పౌరసత్వపు హక్కులకు భంగకారియే కాకుండా, ఫైజ్‌పూర్ కాంగ్రెసు చేసిన వ్యవసాయ భూమి సంబంధమైన తీర్మానానికి. కిసాన్‌సభలకు కాంగ్రెసుకు గతసంవత్సరం జూన్ 28 వ తేదీన ఇచ్చిన స్టేటుమెంటుకు కూడా పూర్తిగా వ్యతిరేకం. నిజంగా ఏడ్వవలసిన విషయమేమిటంటే కింది కమిటీ చేసిన ఇట్టిమడుకు తీర్మానాన్ని మీ కమిటీ ఆమోదించటం. ఈకమిటీలు ఎంతహద్దు మీరిపోయాయో అంత నిరంకుశ ప్రభుత్వం కూడ పోలేదని తిరిగి చెప్పటానికి సాహసిస్తున్నాను.

ఇంతటితో ఈతతంగం పూర్తి కాలేదు. సారన్ జిల్లా కాంగ్రెసుకమిటీ అధ్యక్ష కార్యదర్శులు. వారి మిత్రుడు పండిత గిరీష్‌తివారి గారు కాంగ్రెసుయొక్క నీతిని అమలుపెట్టిన విధానం చూచి నేను నిర్వెరపోయినాను. వాళ్ళు చేయకుండా వదిలిపెట్టింది ఏమైనా ఉంటేగా! సత్యం అహింసల పేరులతో అన్నిరకాల దౌర్జన్యాల్ని చేసారు. ఇన్ని జరిగినా ఏవిపత్తూ రాలేదంటే, నేనూ నామిత్రులూ మామీద కురిపింపబడిన అగౌరవాన్ని. తిట్లను, ఎగతాళిని సంతోషంగా సహించటవల్లనే. మయిర్‌వాన్‌లో జరిగిన సభను ఈకారణాల వల్లనే చాలించి వెళ్ళిపోయాము. లేకపోతే కాంగ్రెసు పేరిట ఆటంకాన్ని కలుగజేసిన వాళ్లు. కొట్లాటకుగూడ ఆలోచన దిగేవాళ్ళే. ఛోర్ సభలో నేను పూచీకత్తు యిచ్చానని సర్వాబద్ధపు వార్తని వ్యాపింపచేయటం నన్నొక సి. ఐ. డి. మనిషినని పిలవటం— ఈవిధంగా సత్య సిద్ధాంతాన్ని అమల్లో పెట్టున్నారు. అంతేకాదు. అయిదునుంచి పదివేలదాకా జనం హాజరైన మహాసభలుకూడా. జరపబడనే లేదని చెప్పుకొంటున్నారు. ఇంతేకాకుండా చెప్రాలో జరిగిన సభను ఆటంక పరుద్దామని నోటీసులు పంచిపెట్టి తీవ్రమైన దుష్ప్రచారము చేసారు. అక్కడే దేవతలు చూడదగిన దృశ్యం ఒకటి సంభవించింది. మీటింగు గేట్ల దగ్గర నించొని వచ్చిన జనాన్ని తిరిగి వెనక్కి పొమ్మని బోధించారు. ఇటువంటి పికెటింగు దేశంలో ఏమూలైనా మన కాంగ్రెసు వాళ్ళు చేసివుంటారా! ఆసభకు హాజరైన వాళ్ళందరూ బాగా చదువుకొన్న వాళ్లే. వాళ్ళనినేను దౌర్జన్యానికి పురికొల్పి ఉండి యుందను గదా. నేను అల్లాచేసి ఉంటే నన్ను పట్టుకొని వాళ్ళు నన్నొక కుంతను చేసేవాళ్ళు. అంతటితో కాంగ్రెసు కమిటీ యొక్క వుద్దేశము నెరవేరేది. ప్రజలనుండి నిజాన్ని మరుగు పరుద్దామని. వాళ్ళని అంధకారములో అట్టే పెడదామని కాకపోతే, అడ్డంకుల్ని కల్పించే ఈపద్ధతికి వేరే ఏమర్థముంది. ప్రపంచంలో ఏడు విచిత్రాలున్నయ్యని వింటున్నాం. కాంగ్రెసు పేరుపెట్టుకొని పైన పేర్కొన్నవిధంగా ప్రవర్తించటం ఎనిమిదవ విచిత్రం కాదూ!

ఒకవైపున ఈకాండ జరిగింది. మరోవైపున "సెర్చిలైటు" (ఇంగ్లీషు) "నవశక్తి" (హిందీ) (ఈరెండూ బీహార్‌లోని కాంగ్రెసు పత్రికలు) చాటించటం ప్రారంభించాయి. "ఉంటే కిసాన్‌సభలో వుండాలి, లేకపోతే కాంగ్రెసులో ఉండాలి. కాంగ్రెసు కిసాన్ సభను వొప్పుకోదు." అని. "సెర్చి లైటు" ఈ విధంగా వ్రాసింది.

"బీహార్ కార్య నిర్వాహకవర్గ తీర్మానంలో లోపల అణిగివున్న అర్థం, కాస్త తెలివితేటలు వున్న వాడికి కూడా తేటతెల్లమవాలి. ఒక్కమాటలో దాని అర్థమిది. కాంగ్రెసువాళ్లు తమకేది ఇష్టమో తేల్చుకోవాలి. ఈసంఘంలో ఓకాలు, ఆసంఘంలో ఓకాలు వీలుపడదు.........ఈరెంటికి మధ్యనుండే వాళ్ళను కాంగ్రెసు ఇంక సహింపదు."

ఈ పత్రికలకు కాంగ్రెసు అభిప్రాయాల్ని తెలిపేవి అని ప్రతీతి వుంది. ఇతర పత్రికలు వీటిని తూ.చా తప్పకుండా అనుకరించాయి. దీన్నిబట్టి కిసాన్ సభల మీదికి దాడివెడతారని స్పష్టమౌతోంది. ఆచరణలో మాత్రము యిల్లా ఉందని నిస్సందేహంగా చెప్పొచ్చు. అటుతరువాత మీ తీర్మానము అర్థము అది కాదని మీరు నిర్వచనము జేసారు. కాని ఆ నిర్వచనం చాలా ఆలస్యంగా వచ్చింది. ఇంకో వింత ఏమిటంటే, చెప్రాలో జరిగిన సభస్టేటుమెంటును ఆధారం చేసుకొని ఆటంక పరుపబడింది. ఆసభలో పంచిపెట్టబడిన నోటీసే దీనికి తార్కాణం. ఇతర జిల్లాల అనుభవాలు నాకు చేరిన— నమ్మదగిన—రిపోర్టు ఈ నా అభిప్రాయాన్ని బలపరుస్తున్నవి. ఆ తీర్మానంయొక్క నిర్వచనంకాదు మాకు ప్రధానం. ఆతీర్మానం ఆచరణలోకి ఎలా తీసుకొని రాబడుతోందో ముఖ్యంగా చూడాలి.

ఈ దీర్ఘమైన జాబుని పూర్తిచేయక ముందు యింకా కొద్దివిషయాలు తెల్పటం అవసరమని తోస్తోంది. నేను కాష్మీర్‌నుంచి తిరిగి రాగానే కాంగ్రెసు మంత్రివర్గాన్ని. మంత్రుల్తో సంప్రదించకుండానే, గయలో బహిరంగంగా ఆక్షేపించానని వార్తాపత్రికల ద్వారా వొకనేరం నామీద మోపబడింది. నేను కాష్మీర్‌నుంచి 24—8—37 వ తేదీన తిరిగివచ్చానని మీకు తెలుసు. 26—8—37 వ తేదీన నా అభిప్రాయాల్ని స్పష్టంగా వెలిబుచ్చుతూ. వున్న పరిస్థితుల్ని విచారించటానికి కార్య నిర్వాహక వర్గం యొక్క అత్యవసర సమావేశం తప్పకుండా జరిపింప వలసిందని కోరుతూ మీకొక పెద్దజాబు వ్రాశాను. కాని మీ ప్రత్యుత్తరం నన్ను చాలా నిరుత్సాహ పరచింది. అత్యవసర సమావేశము యొక్క ఆవశ్యకత మీకు కన్పించలేదు. అటుతరువాత పూర్తిగా ఏడువారాలకు 28—10—37వ తేదీన కార్య నిర్వాక వర్గ సమావేశం జరిగింది.

24—8—37 వ తేదీన చెరుకు కనీసపు వెల నిర్ణయించేముందు నన్నుగూడా సంప్రదించమని బాబూ గంగాశరణ్‌సింగ్ గారి ద్వారా గౌరవనీయులైన డాక్టరు మహమ్మదుగారికి కబురంపించాను. 25—8—37 వ తేదీన గౌరవనీయులైన బాబూ జగల్ చౌదరి గారికి వారి డిపార్టుమెంటు విషయమై వొకటి చేస్తూ వ్రాశాను. అటుతరువాత ఎన్నో సందర్భాల్లో వారికి జ్ఞాపకం కూడా చేశాను. ఆ ప్రకారంగా చేయటానికి ప్రయత్న



## "నిజం చెప్పవలసివస్తే, అదివరకు నేను వాడేదానికంటె తక్కువ ఘాటైన భాషను కాంగ్రెస్ హయాము వచ్చిన తర్వాత ఉపయోగిస్తున్నాను"

మటుంచి, నా ఉత్తరంఅందినట్లుగూడా ఆయన తెలియ బరచలేదు. గౌరవనీయులైన ఇతర ఇద్దరు మంత్రుల్తో గూడా బీహార్ టెనిన్సీ బిల్లు విషయమై మాట్లాడాను. ఆ బిల్లును వెల్లడిపరచే ముందు నాతో సంప్రదించమని వారిని వేడ్కొన్నాను. అట్టి వాగ్దానము ఇచ్చి కూడా వారు నన్ను సంప్రదించ కుండానే ఆ బిల్లును వెల్లడించారు. ఇల్లా జరగలేదని వారు చెప్పగలరా! నేను వారిని కలుసుకొని సంప్రదింపులు చేయలేదని నా మీద కొచ్చిన నేరంలో నిజ మేమైనా ఉందా! గయలో నే నిచ్చిన వుపన్యాసం ప్రచురింపబడనే లేదు. ఆ సభలో మంత్రివర్గాన్ని స్నేహపూర్వకంగా విమర్శించి, వారి మాంద్యానికి కడు విచారించానని ఆ సభకు హాజరైన వాళ్ళచేత ఋజువు పర్చగలను. ఆ వుపన్యాసంలో ఆద్యంత మూనా విమర్శన విరోధ భావంతో కాదనీ, వాళ్ళల్లో వొక మనిషిలాగా. వారి మిత్రుని రీత్యా చేస్తున్నానని స్పష్ట పరచాను. ఆ సందర్భం లోనే చిన్న చిన్న భేదాలు మరచిపోయి గయా మునిసిపల్ ఎన్నికలలో కాంగ్రెసును గెలిపించ వలసినదని కూడా ప్రజలకి అప్పీలు చేసాను. ఆ ఎన్నికలలో జరిగిన విషయ మది. నేను గయలో యిచ్చిన వుపన్యాసం "సెర్చిలైటు"ను పరిచురించమనండి. యథార్థం పూర్తిగా తెలుసుకోవాలంటే ఆ సభకు హాజరైనవాళ్ళని అడగండి. నిజానిజాలు బయటపడతాయి. కావి తప్పులు పట్టడం, కయ్యానికి కాలు దువ్వడమే ఉద్దేశమైతే, నే నెన్ని చెప్పినా ప్రయోజనము లేదు.

ఇంక నేను దౌర్జన్యానికి ప్రజలను రెచ్చగొట్టాననే విషయంతాలోచిద్దాం. కాంగ్రెసు మంత్రివర్గ హయాములోనే ఆత్మరక్షణకోసం లాఠీ ఉపయోగించే హక్కుందని నేనుబోధించానని, కాంగ్రెసు మంత్రులు ఇల్లా నేనుచెప్పినా జైలుకు పంపించరని భరోసా వుండబట్టే ఇల్లా మాట్లాడుతున్నానని, కొందరు పెద్దలు సూచించారు. ఇది సత్యదూరం. గడచిన మూడునాలుగు సంవత్సరాల నుంచి వేలకొలది సభలలో ఆత్మరక్షణ గురించి నావుపన్యాసాల్లో బాగా చెప్పానని బాహాటంగా వొప్పుకుంటున్నాను. నేనుపన్యసించిన ప్రతిసభలో ఇద్దరు షార్టుహాండు రిపోర్టర్లు నావుపన్యాసాన్ని వ్రాసుకుంటూవుండటం పరిపాటి. అట్టి వందలకొలది రిపోర్టులు ప్రభుత్వం వారి స్వాధీనంలో వున్నవి. కాంగ్రెసు మంత్రులు కావలసివస్తే వాటినిమరల పరిశీలించవచ్చును. నిజం చెప్పవలసివస్తే అదివరకు నేనువాడేదానికంటె తక్కువఘాటైన భాషను కాంగ్రెసు హయాము వచ్చిన తరువాత ఉపయోగిస్తున్నానని చెప్పగలను. ఇంతేకాకుండా ఆత్మరక్షణ విషయంలో లక్నో కాంగ్రెసుతోబాటు జరిగిన కిసాన్ మహాసభలోను, అప్పుడు సంయుక్తప్రాంతాల్లో పర్యటన చేసినప్పుడు ఇచ్చిన వుపన్యాసాల్లోను, ఇట్టి అభిప్రాయాల్ని వెలిబుచ్చాను. పంజాబు రాష్ట్రానికి, కలకత్తాకు రెండుసార్లు వెళ్ళటం తటస్థించింది. అప్పుడుకూడా యీవిధంగానే చెప్పాను. ఇల్లాంటి పరిస్థితుల్లో కాంగ్రెసుమంత్రివర్గం ఉందని భరోసాచేత అనర్హనీయమైన లాభాన్ని తీసుకొంటున్నాననటం సమంజసమేనా! ఈరాష్ట్రంలోవుండే పట్టణాల్లో బస్తీల్లో అన్నిట్లోనూ నా అభిప్రాయాల్ని వెలిబుచ్చుతోనే వుంటున్నాను.

మొన్న మొన్ననే చెప్రాలో జరిగిన సభలో నేనిచ్చిన వుపన్యాసం కాంగ్రెసు మూల సిద్ధాంతాలకు ఎంతవరకు వ్యతిరేకమో, అసలు నేను ప్రజల్ని అక్కడి వుపన్యాసంలో దౌర్జన్యానికి పురికొల్పిందీ లేందీ, అక్కడి జనాన్ని అడిగితే తేలిపోతుంది.

అసలు నేనుబోధించే దేమిటో కాస్త పరిశీలించండి.

నే నేగ్రామం పోయినా. ప్రతిగ్రామంలోని రైతులు, జమీందార్లు వాళ్ళ తాబేదార్ల వలని భయంతో వణికిపోతూ నాదగ్గరకువచ్చి రాతిగుండెనైనా కరగింపగల. వాళ్ళ కష్టగాధల్ని వివరించుతూ వుంటే. వాళ్లల్లో ఆత్మవిశ్వాసం పుట్టించకుండా, ఆత్మరక్షణ చేసుకోవాలనే భావం కలగ జేయకుండా నే నెట్లా పూరుకోమంటారు! జమీందారు సిపాయికి రైతుల్ని పీడించటానికి, వాళ్ళని దుడ్డుకర్రలతో బాదటానికి సంపూర్ణమైన హక్కుందని, రైతులకు మాత్రం మూలగటానిగ్గూడ హక్కులేదని గ్రామస్థులు నమ్ముతూంటారు. జమీందారు మనుష్యులు వాళ్ళ యిళ్లల్లోకి దూరి తమ యిచ్చవచ్చినరీతి ప్రవర్తిస్తూంటారు. ఇట్టి పరిస్థితుల్లో, స్వయం రక్షణార్థం అందరూ వొకచోట కూడి తమ చర్యల్ని విరమించ వలసిందని పీడించేవారితో చెప్పవలసిందనిన్నీ, అట్లా విరమించుకోకపోతే పర్యవసానం బాగావుండదని మరీగట్టిగా చెప్పాల్సిందనిన్నీ, రైతులకు నేను హెచ్చరిక చేసినమాట నిజమే. గద్దించితే కుక్కలు పారిపోయేలాగా. వాళ్లుగూడ పరుగెత్తి పోతారు. గద్దించిన తర్వాత మళ్ళీ ధొట్టె ముక్కను తీసికోడానికి ప్రయత్నిస్తే దెబ్బలు తగుల్తావని కుక్కకు తెలిసినట్లు, వాళ్ళ దుష్కార్యాల నుంచి విరమించుకోకపోతే లాఠీలు ఎగురుతాయని జమీందార్లు గ్రహించాలి. ఏవిధంగా వొక మనిషిని పిచ్చికుక్క వొకటి తరుముతూ వున్నప్పుడు, మనమెంత గద్దించినా అది వెనుకకు పోనప్పుడు, ఆవ్యక్తి ఇంకో గత్యంతరం లేక లాఠీ సహాయంతో ఆకుక్కని వదుల్చుకోక తప్పదో, అల్లాగే అన్ని యితర వుపాయాలు విఫలమైనప్పుడు రైతు తనని తాను కాపాడుకోడానికి సిద్ధమవాలి. అప్పుడే ఈదుండగీండ్రు భయపడి వెనక్కి తగ్గుతారు. అహింసా శాంతాలు శ్రేష్ఠతమని, కాని పిరికితనము కంటె దౌర్జన్యమే కనీసము శ్రేష్ఠతరమని, మహాత్మా గాంధీగారు కూడా చెప్పియున్నారు. క్రిమినల్ ప్రొసీజరు కోడ్డులోగూడా తననితాను కాపాడుకోవాలనే హక్కు ప్రతి వ్యక్తికి యివ్వబడింది. ఈవిధంగా నేను చెప్పటం కాంగ్రెసు సిద్ధాంతాలకి వ్యతిరేకమెలా! ఇది దౌర్జన్యానికి పురికొల్పటమెలా అవుతుంది! బద్మాషులు ఇళ్లల్లో ప్రవేశించి, లూటీచేసి, వాళ్ళ భార్యల్ని పిల్లల్ని అవమానపరుస్తూ ఉంటే, ఉక్కిరి బిక్కిరి మనకుండా వుండాల్సిందని రైతులకు చెప్పాలా! హద్దుమీరితే లాఠీలు ఎగురుతాయని ఆ దుండగీండ్రు గ్రహిస్తేనే తప్ప, తమ నీచ కార్యాలనుంచి విరమించుకోరని, నేను సమర్థిస్తున్నాను.

రైతు యాత్రలు జరపటం, రైతుల వూరేగింపులు చేయటం అంటే మంత్రుల్లో అవిశ్వాసాన్ని వెలిబుచ్చటమని కొంతమంది పెద్దల అపోహ పడడం శుద్ధ పొరపాటని మనవిచేసు కొంటున్నాను. మనం అతివేదనతో బాధతో కష్టపడుతూ వున్నపుడు. మన పక్కనే కూర్చొని మన సోదరులో, తండ్రియో, సంతానమో ఉపచారము చేస్తూవున్న, లేక మనవాళ్ళే వైద్యులుగావుండి వైద్యంచేస్తూఉన్నా, మనం గోలచేసో, గందరగోళం చేసో, లేక మాటల ద్వారానో మన బాధని బైటికి వెలిబుచ్చటం స్వాభావికం. ఇటువంటప్పుడు అట్లాచేయడం మనవారిలో మనకి విశ్వాసరాహిత్యాన్ని సూచిస్తుందా! బాధ తొలగిన తర్వాత గూడా యింకా మనం అరిస్తే, ఆ విషయం వేరు. కాని బాధ వుండనేవుంది. అందువల్ల వాళ్లు అరుస్తూనే వుండడం సహజం. వాళ్ళల్లా చేయకపోతే వాళ్ళరోగనివారణ అయిందని ప్రజలు దురూహపడరూ! ప్రతిరోజూ ప్రజలు దేవుణ్ణిప్రార్థించి, అతణ్ణి వరాలు కోరుతారు. సర్వజ్ఞుడని తెలపబడుతూండే దేవుడికంటె విస్తారమైన జ్ఞానము వుండటానికి వీలులేని కాంగ్రెసుమంత్రివర్గము ముందర మన హక్కుల్నిగూర్చి అర్జీచేసుకోడము నొకగొప్ప అపరాధమా!

ఈ జాబు చాలా పెద్దదైంది. కాని నా భావాలన్నీ వెలిబుచ్చడానికి యింకో అవకాశం చిక్కదేమో. అందువల్ల ఈ విషయాలన్నీ దీంట్లోనే యిరికిస్తున్నాను. ఈమధ్యనే బీహార్ టెనన్సీ బిల్లు సందర్భంలో మీ కమిటీ జమీందారులతో వొక ఒడంబడిక చేసుకొంది, ఇల్లా చేయడంవల్ల కాంగ్రెసు సంస్థా బలపడదు. రైతులకా న్యాయం జరుగదు, ఇల్లా చేయడం ఫైజ్‌పూర్ కాంగ్రెసులో చేసిన తీర్మానాల్ని అమలు జరపటం అంటారా, అది అంతకు మునుపు అసలే కాదు. ఏమీ లాభాలు రాక పోగా, రైతుల్లో యిప్పుడు ప్రబలియున్న అసంతృప్తి హెచ్చవుతుంది. ఈ వొడంబడిక కాంగ్రెసు సంస్థ యొక్క ప్రతిష్ఠకు కొంత కళంకం ఆపాదించటమని నా గట్టి నమ్మకం. మన కాంగ్రెసుకు శత్రువులుగా ప్రవర్తించిన యీ కొద్దిమంది జమీందార్లకోర్కెలాభకారిగా ఈ ఒడంబడిక వుంది. వాళ్ళతో యెన్ని రాజీలు మనం చేసుకొన్నా వాళ్లు మాత్రం మన కాంగ్రెసుకు శత్రువులుగానే వుంటారని మాత్రం తమకు

# ★ "నా బొందిలో ప్రాణముండగా కాంగ్రెస్ సంస్థను బలహీన పరచడానికి అంగీకరించను" ★

మరచిపోవద్దని విన్నవించు కొంటున్నాను. దీంట్లో నాక్ను లోప మేముంది? వాళ్ళు కూడా తమ వర్గ విధుల్ని సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. ఈ వాదంబడి కలో జాగ్రత్తలు తీసి విషయ మొక టుంది. ఏ ది... జిల్లాల్లో అయితే అధిక సంఖ్యాకులు యున్నా... నుంచి కాంగ్రెసుకు చేయూత యిస్తూ వచ్చారో, వాళ్లు యీ వాదంబడిక వల్ల చాలా దెబ్బ తింటారు. అందువల్ల మీ కమిటీలో సభ్యునిగా వుంటూ అప్రత్యక్షంగా నైనా మీరు జమీందారులతో చేసుకొన్న వాదంబడికకు పార్టీలో వుండే బాధ్యత నేను మాత్రం తీసుకోదల్చుట లేదు. యింకో విషయం. చెరుకు కనీసము ధర అరణాలకు బదులు అయిదణాలుగా నిర్ణయించడం రైతుల క్షేమానికి (interests) భంగకరమే కాకుండా, కాంగ్రెసు సిద్ధాంతాలికి (principle) ప్రతిష్టకే వొక పెద్ద దెబ్బ తగిలించిన దెబ్బ సాహసిస్తున్నా. కాంగ్రెసు కార్య నిర్వాహక వర్గం అర్థిక శాస్త్రజ్ఞుల లెఖ్ఖల్ని ఆధారం చేసుకొని వొక సిద్ధాంతంమీద చెరుకు కనీసం ధర ఆరణాలు వుండాలని నిర్ణయించింది. ఆ సిద్ధాంతాలు యింకా వుండగానే యీ ధర తగ్గింపు యెందుకో? కాంగ్రెసు మంత్రులు చెరుకు ధర అయిదణాలు వుండాలని నిర్ణయించారు. వర్కింగు కమిటీ "జీ, హో హుకుం" (అయ్యా తమ చిత్తం) అని అంటుకుంది. ఎవరి పురమాయింపులంటే, మన సూచనలో వెడుతూంది? ఈ తెలిపిన కారణాలవల్లనే మీ కమిటీతోటి సంబంధం తెంచుకోవాలని నిశ్చయించుకొన్నాను. ఇల్లా నేను చేయడంవల్ల కాంగ్రెసును <u>విడిచి బయటకు పోతున్నాననిమాత్రం అనుకోవద్దు. కాంగ్రెసు సంస్థను బలహీన పరుస్తున్నానని గాని, నా బొందిలో ప్రాణ ముండేంతవరకు దాన్ని ఎవరేనా బలహీనపరచడానికి అంగీకరిస్తానని గాని తలపవద్దు. బీదవాండ్ల, పీడింపబడేవాండ్ల సేవకుణ్ణని చాటడానికి గర్విస్తున్న నేను యిట్టి మార్గాలకు దారితీయడం అసంభవం కాదా?</u>

యింకొక్క విషయం చెప్పి ముగిస్తాను. మాము తా మీద నిశ్చితమైన నేరారోపణలేమిటో మీరు నాకు దయచేసి యిప్పటికేనా తెలియపరుస్తే కృతజ్ఞుణ్ణి దానిపైన విచారణచేసి చర్య తీసుకోవడం అవసరమైతే, అల్లాచేస్తాను. పూర్తిగా విచారణచేయటం చాలా అవసరంలెండి. పార్టీకక్షలవల్ల అబద్ధప్రచారాలు ఎల్లా బనాయింపుతారో నాకు కొద్ది వ్యక్తిగత అనుభవం కల్గింది. కాంగ్రెసు ప్రతిష్టను నిలువబెట్టగోరే మంచి కార్యకర్తల్ని మా కిసాన్ సభలో వుంచదలచుకున్నా. అందు వలననే వాళ్ళకి విరుద్ధంగా విన్నప్పుడల్లా మాకార్యకర్తల్ని హెచ్చరిస్తూవుంటూ వచ్చాను. ఇకముందు అల్లానేను చేస్తూంటాను కూడా.

దీని ప్రతిని వొకటి పత్రికలకు గూడా పంపుతున్నాను."

అనువాదకుడు:

యం. వి ఆచార్య, ఎం. ఏ. (ఆనర్సు)

("హిందూస్తాన్ స్టాండర్డు" 3—1—1938)

